కృతిభర్త



క్రీ॥ శే॥ శ్రీ శ్రీ శ్రీ పసుపులేటి రామయ్యగారు

# అంకితము

## క్రీ॥ శే॥ శ్రీ శ్రీ శ్రీ పసుపులేటి రామయ్యగారి

## పవిత్రాత్మకు.

ఓ మధురానురాగ భరితోజ్జ్వల నిర్మల మానసాంబుజా
తా ! మహనీయ పండిత వితాన శరణ్యా ! కృతార్థ జీవనా !
ప్రేమ భవత్కరాబ్జములఁ బెట్టితిమామక దృశ్యకావ్య మ
ల్లీ మహితోపదం; బసుపులేటి కులాగ్రణి ! రామయాభిధా !

ఏనాఁడు నీకూర్మి సూనుండు సిద్దయ
    చెంగటకుఁ నన్ను జేరినాఁడొ,
ఏ పుణ్య సమయమం దింపుదీపింప నా
    పలుకుతోఁ బలుకును గలిపినాఁడొ,
ఏ యమృతపువేళ నీ దృశ్య కావ్య మ
    రందమ్ము దగదీఱఁ ద్రావినాఁడొ,
ఏ దివ్య లగ్నమం దిద్దాని నీకంకి
    తమ్ముఁజేయింపఁగాఁ దలఁచినాఁడొ,
ఆ పవిత్ర ముహూర్తంబు నందెమనము
ముప్వురమును గృతార్థ జన్మలమెయగుచు
నమర కీర్త్యపగల నోలలాడినార;
మేటికిఁక వేయి పలుకులో యిద్ధచరిత !

సుమరమ్యంబయి, నిస్తులామృత పరంజ్యోతిర్మయ స్వర్గలో
కమునం దభ్ర ధునీ తటాంతికమునం గాంతిల్లు పూఁదోఁటలోఁ
బ్రమదం బొప్ప విహారముల్ సలుపు దివ్యంబైన నీయాత్మ ని
త్యము నీ బౌద్ధకథా సుధా జలధి నీఁదల్ గొట్టుతన్ ధీనిధీ.

సతత జఘన్య జీవికల సంపదలన్ గడియించి, దాఁచి, గ
ర్వితులయి చావరెందఱిల పీటిఁడు? లవ్విధిఁగాక - చచ్చియున్
బ్రతికితి వన్యదుర్లభ చిరంతన పుణ్యమహత్వ శక్తి నా
కృతిపయి నాయకత్వము వహించి మహోజ్జ్వల కీర్తిమూర్తివై.

జిలుఁగు మొగుళ్ళ క్రొందెరల చేరువ దాఁగిలిమూఁతలాడుచుం
బొలుచు త్వదాత్మ తారకకుఁ బుణ్యకథం గృతి నిచ్చి, కోటిజో
తల నిడి, నీ సుధామధుర తత్త్వ మహోన్నతిఁ జాటినాఁడ; ని
స్తుల నిఖిలాంధ్ర ధాత్రిపయి శోభిలుమింక విరించి కల్పముల్.

లలిఁబరిపుల్ల సుందర కలాప కలాపి విలాసినీ కళా
విలసన మొప్పఁ బుష్ప వనవీథుల లాస్యము సల్పు సాహితీ
లలనకు నాథుఁడౌ ప్రణయలాలసుఁడే కద మానవుండు; లో
ఖులకు నుదాత్తకీర్తిమయ పుణ్య చరిత్రము లెట్టు లబ్బెడిన్?

నీ జ్యేష్ఠ పుత్రుండు నిశ్చల నీతి గు
ణాలవాలుఁడు పిచ్చయార్య మౌళి,
నీచిన్ని కొమరుండు నిరత పండిత రక్ష
ణా సక్తమతి సిద్ధయాహ్వయుండు,
నీ చిన్ని కోడలు నిరుపమ సద్గుణ
సమ్మాన్య చరిత లక్ష్మమ్మదేవి,
నీ కూర్మి యాత్మజ నిర్మల సద్ధర్మ
జీవన పరిపూత శేషమాంబ,

# ప రి చ య ం

అమాయికతా తమస్విని‌లో దేహాన్ని మఱచి నిద్రపోతూండిన విశ్వ ధాత్రిని విజ్ఞానప్రభాతకాంతుల్తో గిలిగింతలుపెట్టి మేలుకొల్పిన అమృత మయి మన భారతమాత. పాశ్చాత్యసుందరి అనాటికింకా వచ్చీరాని పాల పలుకుల్తో తప్పటడుగులు వేస్తూం డినపసిపాప. మహోన్నత మైన అభ్యుద యంతో ఖండ ఖండాలను ఉజ్జ్వాతలూగించిన దివ్యభారతి ఆనాడు పాశ్చాత్య సోదరి జ్ఞానవై పథ్యానికి సొంపు పెంపుల్ని సమకూర్చింది. ఈలాంటి చల్లని తల్లిని అహింసాతత్త్వస్రవంతుల్లో ఓలలాడించి, తియ్యతియ్యని ప్రణయ గీతాలను పాడించింది బంగారుబౌద్ధయుగం. అది భారతదేశ నందనానికి మనోహర వసంతమైంది. కొన్నిలక్షలయేండ్లు భారతీయహృదయాలను శాసించిన ఆర్యయుగం ఒక్కటి—ప్రేమతో ప్రపంచసానుభూతిని చూఱ గొని, కొన్నివందలయేండ్లు మాత్రమే సజీవంగా వుండడానికి నోచుకొన్న బౌద్ధయుగం ఒక్కటి. జీవకారుణ్యమూర్తి బుద్ధభగవానుడు సత్యజ్యోతుల్తో హారతులుతీస్తూ, భారతజననిని అపరంజి పల్లకిలో ప్రపంచవీథులవెంట వూరేగించిన అమృతముహూర్తం అది. ఆ అవతారపురుషుడు తన నోటినుండి రాల్చిన అమూల్యభావమౌక్తికాల్ని దేశదేశాలు దోసిళ్ళతో జవురుకొని పోయాయి. కాని, ఆ అహింసాతత్త్వ సముద్రం అనంతం. అందులోని మౌక్తికాలు అప్పటికే కొఱత పడిపోలేదు. జ్ఞానపిపాసువులకు సిద్ధార్థ డిచ్చిపోయిన ఆస్తి అదొక్కటే. అమహనీయుడు మనకు సోద రుడు—దేవుడు.

కావ్యలోకం బౌద్ధవాఙ్మయాన్ని ఆశ్రయించిన యుగం యిది. కవి కలం బుద్ధబోధామృతాన్ని వివిధముఖాల వెదజల్లుతూందీనాడు. బౌద్ధ సార స్వత సాగర మథనం చేసి చెరొకదారిని చేతనై నంత అమృతాన్ని సేకరించి పంచిపెడుతూన్నారు కవికుమారులు. మనసారస్వతంలో స్పష్టంగా అగు

పిస్తూన్న మార్గాల్లో యిదొకటి. పరిపక్వమైన జాతికిగానీ, సంఘానికి గానీ, సారస్వతానికిగానీ, మతానికిగానీ యీ మార్పు తప్పదేమో. యీనాడు ఆంధ్రసారస్వతంలో యీ ఉత్తమపరిణామం కలగడానికి రెండు కారణాలు ఊహ్యాలు. మొదటిది—ఎడతెరపిలేని అమానుష సంగ్రామ సంక్షోభంలో—రక్తపాతంలో మునిగి, విసిగి వేసారిన ప్రజానీకానికి కలిగిన శాంతిదాహం. రెండవది—దాస్యపీడితప్రపంచం తరఫున అహింసా వీరుడై నిల్చి, అహింసా సూత్రపరిశోధనకోసం జీవితాన్నంతా వినియోగిస్తూన్న తపస్వి గాంధీమహాత్మునికి అదృష్టవశాత్తు సమకాలికుల మైనందువల్ల మనకే తెలియక మనలో కలుగుతూన్న పరివర్తనం. రాజకీయ విభేదాల ఫలితంగా కలుగుతూన్న నిరంతర రక్తపాతాన్ని మన సంఘంలోనే కండ్లారా చూడగలుగుతూన్న యీనాడు—యీ అహింసా ప్రబోధం కేవలం హాస్యాస్పదంగా అగుపించవచ్చు. కాని, మానవుని హృదయాంతరాళంలో ఏమూలనో యీ అహింసావాహిని-శాంతిదాహం-అంతర్వాహినిలా ప్రవహిస్తూంది. అది పొంగి పొరలి మానవహృదయ క్షేత్రాన్ని పూర్తిగా తడిపి, ప్రణయశీతలం చేసిననాడే ఆనాడుశాక్యముని—యీనాడు గాంధీమహాత్ముడు—కలలు కంటూన్న స్వర్గరాజ్యనిర్మాణకాలం మనల్ని సమీపిస్తుంది. తప్పదు.

కావ్యం కేవలం కల్పన కానేరదు. అది కాలానికి కవిపట్టిన నిల్వుటద్దం. భూతదర్పణం కూడానేమో! ప్రజలహృదయాలలో పరువులిడుతూ, రోజురోజుకూ పట్టు కల్పించుకొంటూన్న అహింసాజ్యోతికి యీ దృశ్యకావ్యం ప్రతిబింబనమౌతుంది. అంతేకాదు. లోలోన కలుగుతూన్న యీ పరివర్తనను ప్రపంచ వ్యాపారదృష్టితో చూచి, శంకిస్తూ, అహింస ఆచరణకసాధ్యమైన తియ్యని సిద్ధాంతం మాత్రమే నని నిరుత్సాహపడుతూన్న దుర్బలజనసముదాయానికి ఆత్మశక్తిని ప్రసాదించే సాధనంకూడా కాగలదు. కనుక కావ్యానికి విశ్వశ్రేయస్కరమైన ఉద్దేశ్యం వుంది.

దృశ్యకావ్యకర్తను బాధించే ప్రతిబంధకాలు చాలా యెక్కువ—బాధ్యతకూడా యెక్కువే. సన్నివేశసమన్వయమూ, దేశకాలపాత్రవిచక్షణా, రంగౌచితీ, మానవ మనస్తత్త్వ పరిశీలనా, రసపోషణా, భాషాస్వారస్యమూ, కథాకాల సంభవించిన ప్రతిబింబనమూ—యివి ముఖ్యంగా అతణ్ణి బాధించే నాటకాంగాలు. నిత్యజీవితంలో అడుగడుగుకూ మానవుణ్ణి యెదిరించే వివిధపరిణామాలను కండ్లకు కట్టేలా చూపించి, పాఠకుడికీ, ప్రేక్షకుడికీ ఏదో ఒక అమూల్యసత్యాన్ని బోధింపవలసిన అతిలోక విజ్ఞాని నాటకరచయిత, చరిత్రలోని సత్యాసత్యాలను నిర్ణయించవలసిన న్యాయమూర్తి.

పై ఆశయాల కన్నిటికీ యీ నాటకంలో సమాధానా లున్నాయనే చెప్పాలి. చంద్రశేఖర కణ్వశ్రీగారు రెండుమూడు భాషల్లోని ఉత్తమ నాటకాల్ని చదివి రచనలో ప్రజ్ఞను అలవరచుకొన్నవారని పాఠకులకు గోచరించకుండా పోదు. నాటకశాలలో వేషాలగది యేవైపున వుంటుందనైనా తెలీకుండానే నాటకరచనకు పూనుకొనే సాహసికుల్లాంటివారుకారు వీరు. ఎన్నో నాటకాలలో భూమికల్ని నిర్వహించి, జయాపజయాలను పొంది, రంగౌచితిని సమగ్రంగా అర్థంచేసుకున్న అనుభవజ్ఞాని.

ఈ తియ్యని భావాలను చవి చూడండి :

"జీవిత నృత్యం చెల్లిపోయిన తర్వాత ప్రకృతి సూత్రధారి ప్రపంచ రంగంమీద నిన్నుగానీ, నన్నుగానీ, మహారాణీనిగానీ, యెవ్వర్నిగానీ ఉండనివ్వదు. ఆ నటనలో హింసాభూమిక ఘోర మృత్యువును కౌగిలించుకొంటుంది. అహింసా భూమిక తియ్య తియ్యని ప్రేమ గీతాలను పాడుకొంటుంది."

"నీ మనస్సే నిన్ను పవిత్రుణ్ణిగా చెయ్యగలుగుతుంది. మానవుడు తనకు తానే కల్పవృక్షం. నీ మెదడులో కోటి స్వర్గాలున్నాయి. అనుభవించు."

"ఆత్మ అబద్ధ మాడదు. మురికై పోయిన మనస్సు నుండి పవిత్రమైన ఆత్మ వేరుపడిపోతుంది. ప్రాణి లోకానికి మానవుడు పడిన అప్పునూ వడ్డినీ గుణిస్తూన్నది ఆ ఆత్మే. దాన్ని మోసగించలేవు."

"బానిసత్వపు నరకాన్ని స్వతంత్ర స్వర్గంగా మార్చగలిగిన వీరుడు ఒక దేశంలో ఒక్కడే జన్మిస్తాడు. నిన్ను నిందించే దేశ ద్రోహులు కూడా నువ్వు సంపాదించే స్వాతంత్ర్యశాంతిలో రేపు భాగం పంచుకుంటారు."

"మరణం శాంతి రాక్షసి—జననం సంపెంగ పూవు—కష్టసుఖాలు ఉషస్సంధ్యలు."

కావ్యోద్దేశాన్ని ప్రేక్షక హృదయాలలో హత్తటంలో కవి ఏమాత్రం సఫలుడుకాగలిగేడనేదే కావ్యానికి గీటురాయి. ముఖ్యంగా అభినయానికి—అనుకుంటాను. అలా పరీక్షిస్తే—యీ నాటకంలో—సర్వ భక్షక రూపంతో నాలుకలు చాపుకొని వస్తూన్న సామ్రాజ్య కాంక్ష పద్మావతి—ఆ సామ్రాజ్య కాంక్షచేతి కీలుబొమ్మ అజాతశత్రువు—అంతరాత్మలా వినిపించీ వినిపించక అగుపించీ అగుపించక హెచ్చరిస్తూన్న అహింసా మూర్తి—ఉన్నవూరు తిన్న యిల్లు దైవసమంగా భావించి స్వదేశాభిమానాన్ని చాటే జీవకుడు—నిర్మల ప్రేమ స్వరూపిణి వజిరా కుమారి—సమర కార్యాన్ని సద్వినియోగంచేసి చూపించిన పసేనది—వీరు ముఖ్యులు. దృశ్యకావ్యానికి అత్యవసరమైన విభిన్న ప్రవృత్తులు యిందులో స్పష్టంగా కనిపిస్తున్నవి. విభిన్న ప్రవృత్తులు రాపిడి పడినప్పుడే—అవి ఢీకొన్నప్పుడే—మానవ జీవితంలో సంచలనం— విప్లవం ఏదికానీ కలుగుతుంది. అప్పుడే నాటకం ఉద్భవిస్తుంది. ఈ విభిన్న ప్రవృత్తుల్ని నడపటంలో కావలసిన మెలకువ యీ రచనలో అగుపిస్తూంది. ముఖ్యంగా పద్మావతి పాత్ర. ప్రాణ ప్రయాణ సమయంలో కూడా "కోసల సైన్యాల నెత్తురుతో నా శవాన్ని అభిషేకించండి." అని కోరుతుంది చక్రవర్తిని.

మానవత్వంలోనే యిమిడివున్న మృగత్వానికి ప్రతిగా పద్మావతిని కవి చిత్రించాడు. అందుచేతనే ఆమె అప్పుడు కూడా పరివర్తనం పొంద లేదు—పొందకూడదు. పశ్చాత్తాపతప్తయై పరితపిస్తూ ప్రాణాలు వదిలే పద్మావతిని చూడాలని అందరూ ఉవ్విళ్ళూరుతారు. కాని యిదే చాలా సమంజసంగా వుంది. పద్మావతి మనకు అధికంగా అగుపించదు. కాని, అజాతశత్రువులో ఆమె ప్రళయతాండవం మనకు అడుగడుగుకూ కనిపిస్తూంటుంది. అజాత శత్రువు వెనకాలే పొంచివింటూండి నిష్క్రమించేమూగ పద్మావతి ఆ నిశ్శబ్దతలోనే తన రాక్షసత్వాన్ని అమోఘంగా వెల్లడిస్తుంది.

హింసా కాంక్షకు ఒక్కసారి తావిచ్చాడు అజాతశత్రువు. అది విడివడరాని వివాహబంధమైంది. తన వ్యక్తిత్వం అప్పుడప్పుడు తన్ను హెచ్చరించినా బయటపడలేక అధోగతి పాలవుతాడు. మరొక చక్కని పాత్ర సన్నిధాత. మంచిచెబ్బరల మధ్యపడి, ఏటూ నిర్ణయించుకో లేకుండా అల్లాడుతూన్న సామాన్య వ్యక్తి సన్నిధాత. అతనిలో అంతర్వాణి అస్పష్టంగా పలుకుతూంది. దాన్ని స్పష్టపరచటానికి మరొక శక్తి అవసరమైంది. భగవానుల ప్రబోధవాణిని విన్నాడు. విని, ముక్కుకు సూటిగా పోయాడు. అంతే—ప్రాణాలను కూడా లెక్కచేయలేదు. హింసలో ప్రాణాలు తీయటానికి జడవనివాడు అహింసావలంబి అయి ప్రాణాలివ్వటానికి జడవలేదు. ఆతనిలో అచ్చపు అహింసా యోధుడగుపిస్తున్నాడు. జీవకుడి ద్వారా కవి మాట్లాడినాడు. ఉత్తమ మానవత్వం యొక్క ఉన్నత స్థాయీభావం జీవకుడు. కథలో యీ భూమిక ఒక సజీవ వాహిని.

కథలో పాత్రపోషణకు మెఱుగుతెచ్చే సంఘటనలూ, నడకా ఉన్నవి. అంతకన్నా దృశ్యకావ్యానికి కావలసిందేదీ లేదేమో: ప్రతి రంగంలోనూ కథ కొంతదూరం నడుస్తూంది. నాటక కర్త తిష్ఠవేసు

కొని కూర్చొని యెక్కడా ఉపన్యాసాలు చర్చలు ప్రేక్షకుల నెత్తిన రుద్ద లేదు. ఇది నాటకానికి జీవం. పద్యాలువున్నా కథా చలనానికేమాత్రమూ అడ్డుపడకుండా ఉపయోగింపబడినవి.

రచన సులభశైలి. ముద్దులొలికే అచ్చ తెనుగుపదాలు అక్కడ క్కడా దొర్లించి అందం తెచ్చాడు కవి. గంభీర భావాలు మెఱుపులవెల్లా మెరుస్తున్నవి మెదడుకు మేతపెడుతూ.

దృశ్యకావ్యానికి పరిచయవాక్యం గొప్పప్రయోజనకారికాదనే నమ్మకం కలవాడినైనా యీనాచిరకాలమిత్రుడిమీద నాకున్న గౌరవాభి మానాలూ, యీ రచన నాకు కలిగించిన ఆనందమూ నన్నీపనికి ప్రేరే పించాయి. కావ్యవిమర్శచేసేశక్తీ, అర్హతా నాకు లేదు కనుకనే యిది కేవలం పరిచయవాక్యంక్రింద పరిగణించాలి.

తెలుగువాణి యీనామిత్రుని చిఱుకానుకను ఆదరంతో అందు కొంటుందని ఆశిస్తున్నా.

ఈలా

ఆచార్య ఆత్రేయ,

సహాయ కార్యదర్శి,

ఆంధ్రనాటక కళా పరిషత్

గుడివాడ
20-9-46.

## నమోవాకమ్

ఆంధ్ర ప్రపంచానికి నన్ను పరిచయంచేసి, తమ రసజ్ఞతను వెలారించిన శ్రీ ఆచార్య ఆత్రేయగారికి కృతజ్ఞతాపూర్వక నమోవాకం.

గ్రంథకర్త.

భూమికలు :



అజాతశత్రువు

బింబిసారుడు

పసేనది

గౌతమబుద్ధుడు

జీవకుడు

సన్నిధాత

పద్మావతీదేవి

వజిరాకుమారి

[నడిరేయి. రాజగృహంలోని అంతఃపురం, బింబి సారుడు గాఢంగా నిద్రపోతూంటాడు. లోపల్నుండి]

చరంతి బాలా దుమ్మేధా
అమిత్తేనేవ అత్తనా
కరోంతా పాపకం కర్మం
యంహోతి కటుకప్ఫలం.*

నిశ్శబ్దం. కొంతసేపటికి సన్నిధాతను వెంటతీసుకొని అజాతశత్రువు మెల్లగా మేడమీదినుండి దిగి, మెట్లమీదికి వస్తాడు. తండ్రి గాఢంగా నిద్రపోతూండడంచూచి బంధించండని భటులకు సైగచేస్తాడు. భటులు హఠాత్తుగా బింబిసారుడిమీదబడి చేతులువిరిచి కట్టేస్తారు.]

బింబి:—[బిత్తరపోయి, లేచి పెనగులాడుతూ] ఎవరు ? స-న్ని-ధా-తా! ఎవర్ని మీరు బంధిస్తూండడం ? ఆ ? ఎందుకు ? ఎవరు ? ఎవరు ?

అజాత:—[మెట్లమీదనుండే] అ-జా-త-శ-త్రు-వు

బింబి:—ఆఁ ? కుణికా! నువ్వేనా నన్ను బంధించడం ? నాకుణికుడేనా ? నా ముద్దుల కొడుకేనా ?

అజాత:—కాదు. కుణికుడు యిప్పుడు మీ కొడుకు కాడు.

బింబి:—నీకు నేను ఏద్రోహం చేశాను నాయనా ?

---

* యీగుర్తు కలిగిన శ్లోకాలు బుద్ధభగవానుల "ధమ్మపథం" లోనివి.

అజాత :—కుమారుడికి తండ్రి కలిగించిన పరాభవం—చెల్లనదేవి కొడుకులకు వజ్రహారాలనూ, పట్టపు ఏనుగుల్నీ దోచియిచ్చిన వాత్సల్యం—మూడు కాళ్ళ ముదిమిలోకూడా సింహాసనందిగని స్వార్థం. చాలునా యివి? సన్నిధాతా! ఊం—

బింబి :—కుణికా? నువ్వేనా మాట్లాడుతున్నావు. నేను నా కలలోకూడా నీకు ద్రోహం తలపెట్టలేను.

అజాత :—ద్రోహం—ద్రోహమే కాదు, గుండెలు నిప్పు కొండల్లా పేలిపోతున్న అవమానం-మగధ సామ్రాజ్యం తుపానుగాలిలో ఊడ్చుకొని పోతున్న మోసం - యింకా యేంకావాలి? మా బ్రతుకుమీద పిడుగుల్ని కూల్చి, గుండెల మీద చెయ్యి వేసుకొని నిద్రపోతున్నారు.

బింబి :—నీ మాటల్లో అర్థమేమో నాకు తెలీడం లేదు. నా ముద్దు కుమారుడికా నేను అన్యాయంచేసింది? కుణికా! యిప్పుడు మాట్లాడుతున్నది నీ మనస్సా? అందులో దాగివున్న పిశాచమా?

అజాత :—ఆ పిశాచాన్ని సాగ నంపడానికే యీ ప్రయత్నం.

బింబి :—కుణికా! యిది నీకు న్యాయమా నాయనా! నీకన్న తండ్రినేనా నువ్వు బందీచెయ్యడం? కుణికా! ఆలోచించుకో. నేను నీకు తండ్రిని—నిన్ను నా గుండెల మీద ఆట్లాడించుకొన్న తండ్రిని.

అజాత :—మీరు నాకు తండ్రి అని మీరనుకోం టూన్నా మీకు కొడుకునని నే ననుకోవడం లేదు. సన్నిధాతా! ఊఁ—చెఱసాలకు—అందని దూరంలో అన్నం పెట్టి, యేడిపిస్తూవుండాలని మా ఆజ్ఞ - మేము చెప్పేవరకూ గుక్కెడు నీళ్ళకుకూడా చెరసాలలో ప్రవేశం లేదు. ఊఁ—

[బింబిసారుణ్ణి బంధించి యెత్తుకు పోతూంటారు భటులు.]

బింబి :—కుణికా! కుణికా! కుణికా!

[లోపల్నుండి : ప్రభూ! ప్రభూ]

[జీవకుడు ప్రవేశిస్తాడు.]

జీవ :—ప్రభూ!

బింబి :—జీవకా! జీవకా!

జీవ :—ప్రభూ!

అజాత :—[మెట్లు దిగివచ్చి, కత్తితో అడ్డపెట్టి జీవకుణ్ణి ఆపి వేస్తాడు.]

బింబి :—జీవకా!

[భటులు బింబిసారుణ్ణి యెత్తుకు వెళ్ళిపోతారు.]

జీవ :—ప్రభూ! యీ ప్రళయ మేమిటి? యెవరిదీ సాహసం? యెవరు చక్రవర్తిని బంధించింది?

అజాత :—మ-గ-ధ-స-మ్రా-ట్టు.

జీవ :—కారణం ప్రభూ!

అజాత :—రా—జ్య—దా—హం.

జీవ :—తమదా? వారిదా?

అజాత :—జీవకా! మీ సాహసానికి మన్నించాం.

జీవ :—ప్రభూ! యిప్పటికే ప్రజల మనస్సుల్లో పొగ రాజుతున్న అగ్ని యీ దుండగంతో యింకా నాలుకలు చాపుతుంది. మగధప్రజలు మిమ్మల్ని క్షమించరు. సార్వభౌముడు ప్రజల అనురాగాన్ని చూరగొన్న ప్రేమమూర్తి.

అజాత :—అరికట్టడానికి మాకు శక్తివుంది.

జీవ :—ప్రజాశక్తినా ప్రభూ?

అజాత :—మా శక్తికి మించిపోదు.

జీవ :—రాజుకు రాజ్యంలోని ప్రజలు రాజులు.

అజాత :—అసంభవం.

జీవ :—ప్రభుత్వంలోని అధర్మాన్ని శాసించేవారు ప్రజలు.

అజాత :—జీవకా! సామ్రాజ్యం సార్వభౌముడిది. సామ్రాజ్యంలోని ప్రజలు సార్వభౌముడి కనుసన్నలకు దాసులు.

జీవ :—ప్రభూ! మనసార ప్రేమించిన తండ్రిని తడిగుడ్డతో గొంతుకోశారు.

అజాత :—ప్రే-మ-ప్రేమే కలిగివుంటే యింత అవమానాన్ని మాకు కలిగించేవుండడు.

జీవ :—అవమానమా?

అజాత :—సందేహమా ? మమ్మల్ని ఒక సామాన్య రాజకీయోద్యోగిలాగు అంగదేశానికి పంపించి, తాను ముసలివాడైనా ఆశ తీరకుండా సింహాసనంమీాద కూర్చొని పరిపాలించడం యెవరికవమానం ? మేము దేశాంతరాల్లోవున్న సమయాన చెల్లనదేవి కొడుకులకు వస్త్రహారాలనూ, పట్టపు ఏనుగులనూ బహూకరించి వైశాలికి పంపడం యెవరికవమానం ? మాకు కాదూ ? మా కతడు తండ్రి కావచ్చు, మేమతనికి కుమారులం కావచ్చుకాని, మేమూ కారప్పుకూడు తింటున్న రాచబిడ్డలమే,

జీవ :—ప్రభూ ! లేతవయస్సులోని మీా వేడిమనస్సులో మంచిచెడ్డల ఆలోచనకు తావే లేకపోయింది. వారు యింత సామ్రాజ్యాన్ని సంపాదించింది యెవరికోసమనుకున్నారు ?

అజాత :— జీవకా ! ప్రపంచమంతా మీాలాగే నిష్కపట మనుకొంటున్నారు మీారు.

జీవ :—తమలాగే తమ తండ్రిగారుకూడా ద్రోహులనుకోవడం తమదికూడా పొరబాటేమో.

అజాత :—మేముచేసిన కార్యం పొరబాటని చెప్పడంలోనే మీా అమాయకత్వం తెలిసిపోతూంది. కన్నకొడుకును యిన్ని అవమానాలకు గురిచేసిన ద్రోహి తండ్రి అయినా సరే, దైవమైనాసరే అనుభవించి తీరవలసిందే.

జీవ :—ప్రభూ ! శాసనాధికారాన్ని చేతబట్టుకొన్న

సత్రూట్టులా మాటలాడకండి. గుండెల్లో చల్లని నెత్తురు ప్రవహిస్తున్న సామాన్యునిలా మాటలాడండి.

అజాత :—మనస్సుపొందే మార్పులకు సామ్రాట్టైనా, సామాన్యుడైనా ఒక్కటే. అది నాగుబాము పగ.

జీవ :—ప్రభూ ! మృగాలకూ మానవులకూ భేదం ?

అజాత :—కొన్ని విషయాలలో నే - యీలాంటి అవస్థల్లో హృదయమున్న జీవులన్నీ సమానమే.

జీవ :—పొరబడుతూన్నారు. మంచిచెడ్డల తారతమ్యం సృష్టిలో ఒక్క మానవహృదయానికే. అది ధర్మంతో నిండి పోయినప్పుడు అందులోనుండి ఆనందం సెలయేరై ప్రవహిస్తుంది. దౌష్ట్యంతో నిండిపోయినప్పుడు చల్లని చంద్రకాంతంకూడా అగ్గికొండలా చెలరేగిపోతుంది. ప్రేమతో పుయ్యాలలూగవలసిన హృదయం నిప్పుకణికల్లో కదను తొక్కకూడదు ప్రభూ !

[పద్మావతీదేవి వీళ్ళ వెనుక వైపునవున్న ద్వారం దగ్గిరికివచ్చి, రహస్యంగా యీ మాటల్నివింటూ, కోపంతో తలవూస్తూంటుంది.]

అజాత :—జీవకా ! మేము క్రూరులమనండి, దయాశూన్యుల మనండి, మా క్షేమాన్నిగూర్చి యోజించుకోవడానికి మాకూ భగవంతుడు ప్రసాదించిన మెదడుంది.

జీవ.—కాని, తండ్రిగారిని శాసించింది తమ ఆలోచనకాదు—స్త్రీబుద్ధి ప్రళయకారి.

అజాత :—మేము చేసిన యీ సాహసానికి కారణం మా పట్టపు దేవి పద్మావతి అని మీ ఊహకదూ? అది అపోహ అని హెచ్చరిస్తున్నాము. ఆడదానికి లోబడిపోయి, తండ్రిని చెఱబెట్టే అంత అజ్ఞానులం కాము. మా భవిష్యత్తుకోసమే అతణ్ణి చెఱలో పెట్టించాం.

జీవ :—తమరు బాగుకుమూలత లాడుతున్నారు ప్రభూ! ఆడవారి చేతుల్లో కీలు బొమ్మల్లా తై తక్కలాడే హృదయశూన్యులు పుట్టవలసింది శైశు నాగవంశంలోనా ఆలోచించండి. నా మాటవిని యిప్పటికైనా తండ్రిగారి పాదాలమీద పడి క్షమాభిక్ష కోరండి. మీ పాపాలు పటాపంచలౌతాయి.

[ యింతవరకూ రహస్యంగా వీళ్ళ మాటల్ని వింటూండిన పద్మావతీదేవి జీవకుణ్ణిచూచి కండ్లెఱ్ఱజేస్తూ, కోపంతో ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి వెళ్ళుతుంది.]

అజాత :—జీవకా! మామాటకు మార్పు కలగడానికి సూర్యుడు రేపటినుండీ పడమటిదిక్కున వుదయించాలి. అతడీ శిక్ష అనుభవించి తీరవలసిందే. తప్పించడానికి మీకు కాదుకదా యిక మాకుకూడా సాధ్యంకాదు. క్షమించండి.

జీవ :—ఆవులమందలో కూర్చొని కల్లు తాగుతూన్న ప్రపంచంలో తమరు తాటిచెట్లమధ్య కూర్చొని పాలు తాగుతూన్నారు.

అజాత :—ప్రపంచంతో మా కనవసరం. అది రాజశాసనా న్ననుసరించవలసిందే.

జీవ :—కాలిపోతూన్న ప్రపంచంకోసం ప్రకృతి కన్నీళ్ళు రాల్చదు ప్రభూ !

అజాత :—జీవకా! మీ ప్రయత్నం వృథా! అవమాన రాక్షసి ప్రళయనాట్యం చేస్తున్న యీ అజాతశత్రువు మనస్సులో యిక పితృప్రేమకు తావేలేదు. అతడా చెఱలోపడి మగ్గిపోవలసిందే. మీతో చాలాసేపు ముచ్చటించాం. [వెళ్తాడు]

జీవ :—తీయ తీయని తేనియ తెట్టెలోన
ఒరుల హింసించు మధుపాయి యోధులేల?
ఎగుర ఱెక్కలువచ్చిన ఖగమదేల
యొదఁ దలంపదు పుట్టింటినేని ప్రకృతి !!

[ప్రతిసీర]

[అంతఃపురం. పద్మావతీదేవి చిరాకుతో అటూ యిటూ తారాడుతూంటుంది.]

పద్మా :—అవమానం - జీవకుడిసాహసం పద్మావతి పట్టమహిషిత్వానికే కళంకం - మా కూడుతిని, మా గుడ్డ కట్టి, యీనాటికి మాదారికే అడ్డుకొండై నిలిచాడు—

[హజారంలో గంటమ్రోగుతుంది]

[జీవకుడు ప్రవేశిస్తాడు]

జీవ :—నమస్కారం మహారాణీకి.

పద్మా :—[దొంగనవ్వుతో] మహాశయా! నూరు నమస్కారాలు - చాలవేమో - వేయి నమస్కారాలు. కూర్చోండి.

జీవ :—సేవకుణ్ణి మహారాణీ!

పద్మా :—తమరీ రాజకుటుంబానికి ప్రాణదాతలు కాని, సేవకులేలా అవుతారు?

జీవ :—[చిరునవ్వుతో] మహారాణి కరుణకు జీవకుడి జీవితమంతా ఋణపడివుంది.

పద్మా :—కాదు - యిప్పుడా ఋణాన్ని వడ్డీతోకూడా తీర్చుకుంటున్నారు.

జీవ :—నేను తీర్చుకొంటూన్న ఋణమే పాటిదిమహారాణీ! పాలపొంగులా పొంగుతూన్న యీ ధర్మక్షేత్రానికి నిర్మాతలు - కాదు - శ్రీరామరక్ష - తమరే కదా?

పద్మా :—తమ అలంకారాలు అర్థంకావడంలేదు. క్షమించి—

జీవ :—బింబిసారులు నాటిన శైశునాగ సామ్రాజ్య వృక్షం తమ అనురాగజలంతో మొగ్గలుతొడిగి పువ్వులు పూస్తూంది.

పద్మా :—ఆడదాని చేతిక్రింద మగధరాజ్యం శాసింపబడుతూందనా తమ అభిప్రాయం?

జీవ :—తమ వలపుగాలికి వుయ్యాలలూగుతూన్న మల్లెపూవు కుణిక సార్వభౌములహృదయం. అందుండివస్తున్న పరిమళం చెరలో మురిగిపోతూన్న బింబిసారుల ఆత్మను ఆనందంతో వుజ్జీవిత లూపుతూంది. ఆ భాగ్యం తమ కరుణాకాక మరేది మహారాణీ!

పద్మా :—మీ పొగడ్తలకు మేము నవ్వుతో వొడవ్వలసి వస్తూంది.

జీవ :—మంటలమీంది నాలుకలకు అందులో ఆవిరైపోయే తైలం నీలిరంగులు దిద్దుతుంది మహారాణీ!

పద్మా :—మా మెదడుకు మీ మహత్తర భావాలు చాలా దూరమౌతున్నాయి.

జీవ :—అవును—సత్యంలోని బరువును అసత్యం మొయ్యలేదు. ఆధర్మంతో మురికైపోని చూపులకు ఆకాశంలోని నక్షత్రాలు పడకటింటిలోని రంగులదీపాలు.

పద్మా :—ధన్యవాదం—

జీవ :—గొంతులోనుండి వస్తూన్న మీ ధన్యవాదానికి కండ్లలో తొంగిచూస్తున్న కోపం పూతమెరుగులిస్తూంది.

[అజాత శత్రువు ప్రవేశిస్తాడు]

పద్మా :—స్వాగతం చక్రవర్తికి.

జీవ :—[ లేచినిలుస్తాడు ]

అజాత :—జీవకా! లేచారెందుకు?

జీవ :—[ చిఱునవ్వు ]

అజాత :—పద్మావతీ! యివ్వేళ వుదయం చిరంజీవి ఆరోగ్యాన్ని పరీక్షించారా జీవకులు?

పద్మా :—ప-రీ-క్షిం-చా-రు.

జీవ :—చిరంజీవి ఆరోగ్యం చక్కగానేవుంది ప్రభూ!

అజాత :—సంతోషం. పద్మావతీ! మేము చిరంజీవిని ముద్దాడి చాలాసేపైంది. సభలో కూర్చున్నామే కాని మనస్సుమాత్రం చిరంజీవి మీదనే.

జీవ :—ఆహా—అనాడు - యీ రాచిలుక గోరువంకను హింసించి, జామపండు దోచుకున్నది. యీనాడు తన గూటిలోని పసుగందును తుమ్మెద కుట్టినందుకు దిక్కులు ప్రతిధ్వనించేలాగు రోదన చేస్తూంది.

అజాత :—జీవకు లేదో కవితాగానం చేస్తున్నారు.

జీవ :—తలితండ్రుల ప్రేమను తాను తండ్రి అయినప్పుడు కాని మానవుడు తెలిసికోలేడు ప్రభూ!

పద్మ :—జీవకుల అవస్థచూస్తే నవ్వువస్తూంది.

జీవ :—అవును. ఒక హృదయం నవ్వితేనేకాని మరొక హృదయం యేడవదు. ఒక హృదయం యేడిస్తేనే కాని మరోహృదయం నవ్వడానికి వీల్లేదు.

పద్మ :—మీ మాటల వెనకనుండి యేదో నిష్ఠుర భాష వినవస్తూంది. రాజవంశాన్ని చాలా చులకన చేసి మాట్లాడుతూన్నారు జీవకులు.

అజాత :—పద్మావతీ!!

పద్మ :—రాజకుటుంబాన్ని చిందవందర చేయ్యానికే మీరు కంకణం కట్టుకున్నట్టుంది.

జీవ :—పొరబాటు మహారాణీ! బింబిసారుల ప్రేమ ప్రవాహాన్నే చూరగొన్న నేను నా హృదయంనుండి కొన్ని అశ్రు బిందువుల్నిమాత్రం రాల్చ గలుగుతున్నాను. దీనికి నేనపరాధినైతే యీ దేహాన్ని ముక్కలు ముక్కలుగా తరుక్కోండి.

అజాత :—పద్మావతీ! జీవకులు మనకు దైవంతో సమానం.

జీవ :—ప్రభూ! అదొక విషాదఘట్టం—సార్వభౌముడి పుత్ర ప్రేమకు తార్కాణ. ఆనాడు—అదే వుద్యానాలలోవున్న తమకు ఒక భయంకరమైన అపాయం సంభవించింది. ఆ దృశ్యం యిప్పుడుకూడా నా కన్నుల ముందు యింద్ర ధనుస్సులా ప్రకాశిస్తూంది.

అజాత :—ఏమిటది జీవకా!

జీవ :—ఏముంది ప్రభూ! పాలవానలు కురుస్తూన్న చందమామను చూడగానే హృదయం విప్పి, ముసి ముసి నవ్వులు నవ్వేది కలువకన్నెకాని, గన్నేరు పూవుకాదు గదా ?

పద్మా :—జీవక మహాశయా! అంతఃపురమంతా హృదయంలేని గన్నేరు పువ్వనికదూ మీభావం? [అజాత శత్రువునుచూచి] కాతు మెత్తనివాడైతే గుఱ్ఱం మూడు కాళ్ళతో నడుస్తుంది. [గిరుక్కున తిరిగి వెళ్తుంది.]

అజాత :—జీవకా! తమరు చెప్పదలచుకున్నది నిర్భయంగా చెప్పండి.

జీవ :—అప్పుడు తమ కొక గొప్ప విషజ్వరం సంభవించింది. ఆ సమయంలో తమరు బ్రదుకుతారన్న ఆశ నాకే కలగలేదు. తమ తల్లి కోసలదేవి అదే వుయ్యాల దగ్గర కన్నీరు కాలువలుగా యేడుస్తూంది. ఆ పరిస్థితిలో మహారాజు రాణివాసంలో ప్రవేశించారు. కొండలు మారు మోగి పోతూన్న ఆ కన్న కడుపు శోకంచూచి, కండ్లు తెర వని పసిపాపను ముట్టడించిన ఆ ఘోర జ్వరాన్నిచూచి ఆదయామూర్తి పసిబిడ్డలా యేడ్చాడు. విశాల సామ్రాజ్యానికి దీపంపెట్టిన శైశునాగవీరుడు తన కుమారుడికి జ్వరం తగిలితే ఒక భీరువులా యేడ్చాడు. రాజగృహమంతా ఆనాడు యేడుపుతో ప్రతిధ్వనించి పోయింది. ఆ

నాటి దృశ్యాన్ని నేను బ్రదికివున్నంతవరకూ మరచిపోలేను ప్రభూ! మరచిపోలేను.

అజాత :—జీ-వ-కా!

[పద్మావతి మళ్ళీ వస్తుంది.]

పద్మా :—చక్రవర్తీ! భ్రాంతిలో పడిపోతూన్నారు.

జీవ :—యీనాడు – ఆ అహింసావీరుడు—తాను యెవరి జీవితంకోసం విలపించాడో ఆ కొడుకుచేతనే బందీ అయి, యినుప కమ్ములమధ్య తపస్సు చేస్తున్నాడు.

పద్మా :—జీవక మహాశయా! సంతోషసమయంలో వారి హృదయానికి యీ నిప్పంటించా రెందుకు ?

జీవ :—హింసా సముద్రం యింకిపోయిన తర్వాత దాని లోతులో కనుపించేది శాంతి ప్రపంచం మహారాణీ!

అజాత :—జీ-వ-కా! మా మనస్సెందుకో కారడవిలా మండిపోతూంది. [మెల్లగా వెళ్తాడు.]

జీవ :—మహారాణీ! సెలవా ?

పద్మా:—ఆఁ–మహాశయా!పది వేల నమస్కారాలు. దయచెయ్యండి.

జీవ :—............[వెళ్తాడు.]

పద్మా :— నా దారి కడ్డంగా పడివున్న యీ నాగదారి పొదను నరికి నాశనం చేస్తేనేకాని నాకు నిద్రపట్టదు. నా ప్రయత్నం నిమిషాలమీద నెరవేరాలి—నా సేవకుల్లో

జీవకుణ్ణి తుద ముట్టించినవాణ్ణి బంగారుతో అభిషేకిస్తాను-ఎవ రక్కడ? సన్నిధాతా!

[సన్నిధాత ప్రవేశిస్తాడు.]

సన్ని :—వందే మహారాణీ!

పద్మా:—సన్నిధాతా! నిన్నిక్కడికి పిలిపించిన సంగతి మన చుట్టు ప్రక్కలవున్న గోడలకూడా తెలీకూడదు సుమా!

సన్ని :—మహారాణి ఆజ్ఞకు యే లోపమూరాదు.

పద్మా : నీ వల్ల నాకిప్పు డొక చిన్న ఉపకారం కావాలి. చెయ్యగలవా?

సన్ని —తమకు నేను చేసేది సేవకాని, ఉపకారం యేలా అవుతుంది మహారాణీ!

పద్మా:—శ్ —సన్నిధాతా! పాగ_డ్తల కిది సమయం కాదు.

సన్ని :—ఆజ్ఞ.

పద్మా :—ఆ ఆజ్ఞ ఒక వేళ కఠినమైతే?

సన్ని :—అగ్గిలో దూకమన్నా సరే.

పద్మా:—యీ రాత్రికిరహస్యంగా నాతో నువ్వొక చోటికి రావాలి. నేను చూపించిన వ్యక్తిని - హ - త్య చెయ్యాలి. శక్తివుందా?

సన్ని :—మ-హా-రా-ణీ- ?

పద్మా:—భయపడుతున్నావా ?

సన్ని :—అబ్బే-పువ్వు చిదముడానికి గండ కత్తెర కావల్నా మహారాణీ ?

పద్మా :—రంగంలోనికి దిగింతర్వాత నావల్ల కాదంటే ?

సన్ని :—యింతమాత్రానికే తమ రనుమానిస్తూన్నందుకు చింతగావుంది.

పద్మా :—సంతోషం. తిరిగి మాదర్శనం—

సన్ని :—ఆజ్ఞ.

పద్మా:—ప్రపంచం నిద్రపోయిన కొంతసేపటికి.

సన్ని :—చిత్తం.

పద్మా :—జాగ్రత్త : కార్యాన్ని వేయికండ్లతో సాధించాలి సుమా ?

సన్ని:—తమ రిక చెప్పక్కర్లేదు.

పద్మా:—యీ విషయం మహారాజుకు తెలిసిందా ? ప్రాణాలమీద ఆశ వదులుకోవడం మంచిది.

సన్ని :—అలాంటి భయ మేమీ అక్కర్లేదు మహారాణీ ! సెలవా ?

పద్మా :—వెళ్ళు. [వెళ్తాడు]

[ప్ర తి సీ ర,]

[కటికిచీకటి. అంతఃపురవనంలో ఒకసమాధి. జీవకుడు సమాధి తిన్నెమీద కూర్చొని దుఃఖిస్తూంటాడు. సమాధి అంచులకు తగిలించి వున్న ప్రమిదెల్లో మాత్రం దీపాలు మందంగా వెలుగుతూంటాయి.]

కాలజీమూతాంధకారంబుమాయించు
అమలశంపాజ్యోతి నార్పెదేల ?
ఆనందవీచి నుయ్యాలలూచెడి సౌఖ్య
లక్ష్మివీక్షలఁ జంచలత్వమేల ?
కోటిపుణ్యనదీ వధూటికానాథుని
చల్లనికడుపులో క్షారమేల ?
తారకాక్షరచయ స్థగితాభ్రవీథిపై
భాషతెలియని యాప్రబంధమేల ?
గగనరమణిని ముద్దిడు కాంక్షతోడ
కులికి తలలెత్తు కెరటాలఁ గూల్చెదేల ?
ఏమిసంకల్పమో నీకు నెఱుగరాదు
దివ్యమాయాప్రభావ ! ఓదేవదేవ !!

[సమాధిమీద వాలిపోతాడు. ఆ రామమంతా నిశ్శబ్దం. కొంతసేపటికి సన్నిధాతను వెంటతీసుకొని పద్మావతీ దేవి వస్తుంది. చీకట్లో తన్నెవ్వరూ గుర్తించనట్లు తక్కుతూ, తారుతూ, జీవకుణ్ణి సమీపించి, పోడవమని సన్నిధాతకు సైగచేస్తుంది.]

సన్ని:-[ఆశ్చర్యపడుతూ] మహారాణీ! జీవకులవారు.

పద్మా:—అవును—వార్నే—కానీ—

సన్ని:—జీవకులవారినా?

పద్మా:—శ్—వేదాంతం కట్టిపెట్టి పనికానీ.

సన్ని:—యీమహానుభావుణ్ణి చంపడానికి చేతులాడ్డంలేదు మహారాణీ!

పద్మా:—సన్నిధాతా! తెలుసుకదా పద్మావతిపగ? ఊ!

సన్ని:—యీపాపాన్ని ఒడికట్టుకోలేను మహారాణీ!

పద్మా:—నీప్రాణం—నీసంసారం—జ్ఞాపకముందా!

సన్ని:—త-ప్ప-దా?

పద్మా:—బ్రదుకుమీాద ఆశవుంటే.

సన్ని:—పొరబడిపోయాను. జీవకులవారని తెలిసివుంటే యీ ఘాతుకానికి సమ్మతించే వుండను.

పద్మా:—సన్నిధాతా! ఆలస్యమౌతూంది.

సన్ని:—చి-త్తం—

పద్మా:—అదో—అక్కడేదో సద్దవుతూంది. నేను అంతఃపురానికి వెళ్ళిపోతాను. నువ్వు శీఘ్రంగా పనిముగించి ఒక్కక్షణంలో వచ్చి నెత్తురు గుర్తు నాకు చూపించాలి. అదుగో—యెవరో సమీాపిస్తున్నారు. ఊఁ—[వెళ్తుంది.]

సన్ని:—[అటూ, యిటూ, పరికించి, జీవకుణ్ణి పొడవడానికి కత్తి పైకెత్తుతాడు. హఠాత్తుగా లోపల్నుండి—]

నగరం యదా పచ్చంతం
గుత్తం సన్తరబాహిరం
యేవం గోపేధ అత్తానం
ఖణోవేమా ఉపచ్చగా.*

[బుద్ధభగవానుడు ప్రవేశిస్తాడు.]

సన్ని:—[భయంతో వణికిపోతూ, అలాగే నిలబడిపోతాడు.] ఎవరు ? భ-గ-వా-ను-ల-వా-రు.

బుద్ధ:—ఆగు. సోదరా ! యెవర్నీవు ?

సన్ని:—భ-గ-వాన్ ! స-సన్నిధాతను.

బుద్ధ:—స-న్ని-ధా-త-వు—అజాతశత్రువు సేవకులందరూ హంతకులేనా ?

సన్ని:—క్షమించండి భగవాన్ ! బుద్ధి గడ్డి తిని—

బుద్ధ:—నీకత్తికి బలికాబోతూండిన యీ అభాగ్య జీవి ?

సన్ని:—జీ-జీవకులవారు.

బుద్ధ:—ఆఁ ? [జీవకుణ్ణి సమీపించి] జీ-వ-కు-డు-మృత్యువునోట్లో నోరులేని యేడుపు లేడుస్తున్న పసిబిడ్డ. సోదరా! యీ సీతాకోకచిలుక నీకు చేసిన అపకారం ?

సన్ని:—మహారాణీగారి ఆజ్ఞ భగవాన్ !

బుద్ధ:—ఆఁ ?

సన్ని:—బుద్ధి, ఆమె ఆజ్ఞకు బదులు చెప్పలేకపోయ్యాను. బ్రదుకుమీది ఆశతో—

బుద్ధ:—ఆ ఆశ అనే కత్తికి నీ సాహసం సానరాయై పోయింది. సోదరా! నీకుంపటిలోని పొగలు నీయింటినే చుట్టుముట్టుతాయి. నీబ్రదుకుకోసం అమాయకులప్రాణాలు బలిచేస్తున్నావు. మల్లెపూలపందిరిక్రింద మంటల్ని పోగు చేస్తున్న నీమనస్సు వసంతవనమో, శ్మశానమో ఆలోచించుకో.

సన్ని:—భగవాన్! మహారాణికత్తికి యీ రాజ్యంలో యెదురే లేదన్నసంగతి తమకు తెలీందికాదు. యెందుకో జీవకులవార్ని చంపమని ఆజ్ఞాపించింది. చెయ్యలేనంటే నా బ్రదుక్కే నీళ్ళుతోడుతుందేమో అని యీ ఘోరానికి నడుంకట్టేను.

బుద్ధ:—సోదరా! మానవుల్ని చంపడానికీ, పోషించడానికీ ప్రకృతిలో మరొకశక్తి సృష్టించబడివుంది. జీవకుణ్ణి చంపవలసినవాడివి నువ్వు కావు—నిన్ను బ్రదికించగలిగింది మహారాణీ కాదు. జీవితనృత్యం చెల్లిపోయిన తర్వాత ప్రపంచరంగంమీద ప్రకృతి సూత్రధారి నిన్నుగానీ, నన్నుగానీ, మహారాణీనిగాని, యెవ్వర్నిగానీ వుండనివ్వదు. ఆ నటనలో—హింసాభూమిక ఘోరమృత్యువును కౌగిలించుకొంటుంది. అహింసాభూమిక తీయతీయని ప్రేమ గీతాలను పాడుకొంటుంది.

సన్ని:—భగవాన్! తమరు యీ మూర్ఖుడి మనస్సును నవ్వుతూ యేడిపిస్తున్నారు.

బుద్ధ:—పొరబాటు నాయనా! ప్రేమను కబళించే హింస సత్యజ్యోతిని చూచి బెదిరిపోతుంది. అంతే.

సన్ని:—క్షమించండి భగవాన్! పాపిని—సంసారాన్ని, ప్రాణాలనూ కాపాడుకోవడానికి యీ నెత్తురుకూటి నాశించాను.

బుద్ధ:—సోదరా! జీవకుడి నెత్తురుతో మహారాణి మనస్సును అభిషేకించి నీ సంసారయాత్ర సాగించడానికి పూనుకున్నావు కదూ? [మోకాళ్ళమీద కూర్చొని] ఇదిగో—గౌతమబుద్ధుడి వక్షస్థలం. చీల్చుకో! మానవుల నెత్తురుతో మహారాణుల మనస్తాపాలు చల్లారటల్లైతే—యిదిగో—నిర్భయంతరంగా అర్పించబడుతూన్న సిద్ధార్థుడి గుండె నెత్తురు. యీరక్తం తీసుకుపోయి మహారాణికి సమర్పించి, తన గుండెలమీద తర్పణం చేసుకోమను. సోదరా! నెరవేర్చు స్వామికార్యాన్ని.

సన్ని:—భగవాన్! జీవితంమీది ఆశతో రాక్షసుణ్ణై పోవలసివచ్చింది. [కాళ్ళమీద పడతాడు] కడుపు కక్కుర్తి కోసం యీ దారుణానికి తలపంచాను.

బుద్ధ:—[సన్నిధాతను లేవనెత్తుతూ] లే నాయనా! హృదయ ప్రవాహాన్ని సంకుచితమైనలోయల్లో ప్రవహింపజెయ్యక, విశాలవనాలలో ప్రవహింపజేసి, విశ్వమానవప్రేమ నవలంబించు. నీ దేశాన్ని అమృతభూమిగా చెయ్యగలిగింది నీ భూతదయే. నీ ఆహారం యిదివఱకే ప్రకృ

తిలో సృష్టించబడివుంది. పోయి వెదుక్కో నాయనా! వెళ్ళు.

సన్ని:—భగవాన్! ఆరిపోయిన నాలోని జ్యోతిని తమరు మళ్ళీ వెలిగించారు. యీ దీనుడు యింక తమ దాసుడు.

బుద్ధ:—సోదరా! నీ మనస్సే నిన్ను పవిత్రుణ్ణిగా చెయ్యగలుగుతుంది. మానవుడు తనకు తానే కల్పవృక్షం. నీ మెదడులో కోటి స్వర్గాలున్నాయి. అనుభవించు.

సన్ని:—సెలవా? భగవాన్?

బుద్ధ:—వెళ్ళునాయనా!

సన్ని:—........[నమస్కరించి వెళ్ళిపోతాడు]

[జీవకుడింకా అలాగే స్మృతిలేకుండా పడి వుంటాడు]

బుద్ధ:—జీవకా! జీవకా!

జీవ:—[మెల్లగా కండ్లు విచ్చి] భ—గ—వాన్! ప్రణామం.

బుద్ధ:—జీవకా! బోయవాడి వలలమధ్య దేహం తెలీకుండా నిద్రపోయే పావురంలా పడివున్నావు. మగధరాణి కత్తి నీ నెత్తురు తాగడానికి పరుగులెత్తుతూంది. నీవిక ఒక్క క్షణంకూడా యిక్కడుండకూడదు.

జీవ:—భగవాన్! నాకేమీ అర్థకావడంలేదు.

బుద్ధ:—మానవులు ప్రపంచాన్ని నిరంకుశంగా పరిపాలిస్తున్నారు. అధికార వేదిక మీద అమాయకుల రక్తంతో ముగ్గులు తీర్చుకొంటూంది ప్రభుత్వం.

జీవ:—మ-గ-ధ-రా-ణి నా కంఠంకోసం పరుగు లెత్తుతూందా?

బుద్ధ:—అవును. పాదరక్షలక్రింద నలిగిపోతున్న చలిచీమల దుర్గతికి విముక్తి కాలగర్భంలో యెన్ని పొరల క్రిందనో అణగివుంది. జీవకా! నీవు తక్షణం యీ రాజ్యం విడచిపెట్టడం మంచిది.

జీవ:—భగవాన్! ఆమెకు నేను యే ద్రోహమూ చెయ్యలేదే!

బుద్ధ:—మబ్బుల్నిచూచి నాట్యంచేస్తున్న నెమిలి కన్నె బోయవాడికి యే ద్రోహంచేసింది?

జీవ:—నా జీవితమంతా రాజకుటుంబక్షేమానికే ధారబోశాను. మహారాణి నా సేవనేగాక నా నెత్తురు కూడా కోరుకోవడం నా అదృష్టం. భగవాన్! నేనేపోయి నా కంఠం సమర్పిస్తాను.

బుద్ధ:—జీవకా! సూర్యమండలంలో మంచు వాగులు పారవు. నువ్వుతక్షణం బయల్దేరిపోయి, కోసలరాజు పోషణలో కొంతకాలముండు. మహారాణి దీనికి ప్రతిఫలం త్వరలోనే అనుభవిస్తుంది. వెళ్ళు. ఆలస్యం అపాయకరం.

జీవ:—జీవకుడికి తీరిపోయిందా రాజగృహఋణం?

బుద్ధ:—విచారించవద్దు. మానవుడి ప్రతి అవస్థకూ మార్పుంది.

జీవ:—ఆజ్ఞా బద్ధుణ్ణి భగవాన్!

బుద్ధ:—శుభంభూయాత్.... ........[వెళ్తాడు]

జీవ :—ఓ ప్రణయపూర్ణ విశ్వపయోధిజనని !
నీదుతరగలఁ దరగనై నెగడు నన్ను
తోడబుట్టిన అలయెవెంటాడి యిటుల
శిలకుడీకొట్టి బ్రద్దలుజేయునేల ?

[ప్రతిసీర]

[శ్రావస్తి అంతఃపురవనం. దాని కెదురుగా ఒక యెత్తైన బాటమీద నుండి వనంలోకి దిగడానికి మెట్లు అమర్చబడి వుంటాయి. వజిరా కుమారి ఒక చేతిలో చిలుకనూ, మరోచేతిలో అజాతశత్రువు చిత్ర పఠాన్నీ వుంచుకొని, పాటపాడుకుంటూ బాటమీదికి వచ్చి, వనంలో ప్రవేశిస్తుంది.]

వజిరా:—[ఒక తిన్నెమీద కూర్చొని] కీరవాణీ! చెప్పు—అ-జా-త-శ-త్రు-వు—చెప్పవూ?

చి:—.........

వజిరా:—చెప్పకుంటే నీకీ పండివ్వను. చెప్పు. అ-జా-త-శ-త్రు-వు-చెప్పు.

చి:—అ-జా-త-శ-త్రు-వు.

వజిరా:—మళ్ళీ చెప్పు-అ-జా-త-శ-త్రు-వు.

చి:—అ-జా-త-శ-త్రు-వు.

వజిరా:—[నవ్వుతూ] అలా వుండాలి. [తన వేలి వుంగరాన్ని తీసి, చిలుక కాలికి తొడుగుతూ] చూచావా? నీ కాలికీ వుంగరం యెంత అందంగావుందో. అహ్హాహ్హాహ్హా—

[లోపల్నుండి

కుమారీ!]

[చిత్రపఠాన్ని తిన్నె ప్రక్క దాచిపెడుతుంది వజిరా]

[పసేనది ప్రవేశిస్తాడు]

ప:—కుమారీ! యింకా శుద్ధాంతానికి వెళ్ళ లేదా?

వజిరా:—యిప్పుడే వచ్చాం నాన్నా! యింకా కొంచెంసేపు విహరించి—

ప:—అదిసరే కాని, కుమారీ! కొన్ని రాజకీయ కారణాల వల్ల నీ స్వయంవరం ప్రస్తుతం ఆపవలసి వచ్చింది. సమ్మతమేనా?

వజిరా:—నాన్నా! నిర్ణీతం కాని మనస్సుగల ఆడ దానికి స్వయంవరం కాని, ఆత్మను యీవరకే ఒకరి కప్ప గించిన నాలాంటిదాని కెందుకూ? నా స్వయంవరానికిప్పుడే మీా తొందర్లేదు కాని, ఆ కారణాలునాతో చెప్పదగిన వేనా?

ప:— రాజకీయాలమ్మా!

వజిరా:—మన బంధువులకు సంబంధించి వుంటే—

ప :—ఆఁ—బంధువులే—బం—ధు—వు—లు—వాడి బంధు త్వం యేనాడో బూడిదై పోయింది. క్రూ—ర—కి—రా—త—కు—డు.

వజిరా:—మేనమామగార్నేనా తమరు తిడుతూం డడం?

ప:—కుమారీ! ఆమాట నీ నోటినుండి మరొక సారి రాకూడదని ఆజ్ఞ. ఆ దుర్మార్గుణ్ణి 'మేనమామ' అని సంబోధించి, యీ కారడవిని యింకా తగలబెట్టేస్తున్నావు.

వజిరా :—శాంతం సౌఖ్యదాయి నాన్నా!

ప :—సముద్రానికికూడా హద్దుంది. కన్న తండ్రిని చెరలో పెట్టించాడని విన్నప్పుడూ శాంతమే వహించాను. మొన్న మొన్న జీవకుణ్ణి చంపించారని విన్నప్పుడూ శాంతమే వహించాను. ఆ రాతిగుండె కసాయి యీనాడు కాశినికూడా కబళించాడట.

వజిరా :—అతని తల్లికి అరణంగా వచ్చిన రాజ్యం అతని దేకదా?

ప :—దాన్ని యీవరకే చర్చించాం. కన్న వాళ్ళను కార్చిచ్చులో తోసి దహించిన ఛండాలుడు కోరి వాతాడుకాని, కొడుక్కాడు.

వజిరా :—మీా కొడుకే ఒకవేళ తప్పుచేస్తే మీారు క్షమించరా?

ప :—నాకు శత్రువైనవాడు కొడుకైనా నేను క్షమించను.

వజిరా :—నాన్నా! అతను అమాయకుడు. తెల్లనివి పాలు, నల్లనివి నీళ్ళు. అతన్ని కీలుబొమ్మనుచేసి ఆడిస్తూన్న సూత్రధారి తెరవెనుకవుంది. అతను మీాకు శత్రువైనా మేనల్లుడు.

ప :—ఆడదానికి దాసోహమని పూరిమేసే పశువు నా కల్లుడు కానక్కర్లేదు. [తిన్నె ప్రక్కనవున్న చిత్రపతాన్ని గుర్తిస్తాడు.] కుమారీ! యెవరిదీ చిత్రపఠం?

వజిరా :—.............

ప :—వీడి చిత్రపఠం నీదగ్గరి కెందుకు వచ్చింది ?

వజిరా :—.............

ప :—కుమారీ ! పలకవేం ? వీడేనా నీ ప్రియుడు ? నా శత్రువునేనా నువ్వు బొమ్మలు గీయించి నా అంతః పురాన్ని నింపుతూండడం ?

వజిరా :—నాన్నా ! మీ కుమారిమీద మీ కధికారముందికాని, మీ కుమారి హృదయంమీద మీ కుమారికే అధికారం లేదు.

ప :—నీ అభిప్రాయం ?

వజిరా :—వజిరా మగధ చక్రవర్తి అర్థాంగి.

ప :—పసేనది కుమార్తె కాదు.

వజిరా :—నన్ననాధను చేస్తారా ?

ప :—అభిప్రాయాన్ని మార్చుకోలేవా ?

వజిరా :—ఆత్మ ఒకరికీ, శరీరం ఒకరికీ అప్పగించడం భారత నారికి విరుద్ధ సాంప్రదాయం నాన్నా !

ప :—కుమారీ ! తండ్రీ కూతుళ్ళిరువురూ ఒకే కత్తికి బలి అయిపోయిన చరిత్రను భవిష్యద్భారతదేశం చదువుకోకూడదు.

వజిరా :— నాన్నా ! మగధ చక్రవర్తి మీ అల్లుడు.

ప :—కుమారీ ! నా శత్రువును నా నట్టింటనే ప్రతిష్ఠించి పూజిస్తున్నా వన్నమాట.

వజిరా :—నాన్నా !

ప :—నా సోదరి జీవితాన్ని నాశనంచేసి, నా రాజ్యాన్నే కబళించదలచుకొన్న నా శత్రువు నీకు పరమా ప్తుడూ, ప్రేమికుడై నాడుకదూ? కుమారీ! నువ్వు రాచ కన్నెవా? వీధుల వెంబడి తిరిగే స్వైరవిహారిణివా?

వజిరా :—నాన్నా!

ప :— [తల మోదుకుంటూ] అబ్బా—యీ నాటికి నా కుమార్తే నా గౌరవానికి మారి అయింది—నా శత్రువుకు బాసటగా నిలిచింది—నా అంతఃపురమే నాకు యుద్ధరంగమైంది—ఛీ! ఆడదానికి తండ్రి కావడంకంటే ఆవులమందకు కాపరి కావచ్చు. [వెళ్తాడు.]

వజిరా :—నాన్నా! నాన్నా!! నాన్నా!!! [నేల కూలుతుంది]

[జీవకుడు దుఃఖంతో పాడుకొంటూ, వనాని కెదు రుగా వున్న బాట మీదికివచ్చి, స్పృహతప్పి మెట్లమీద పడిపోతాడు. వజిరా లేచి బిరబిరా జీవకుణ్ణి సమీపిస్తుంది].

ఎవరో బౌద్ధ భిక్షువు—

[లోనికివెళ్ళి నీళ్ళు తెచ్చి జీవకుడి ముఖంమీద చల్లుతుంది].

స్వామీ! స్వామీ!

జీవ :—[తిన్నగా కండ్లు విప్పి] ఎ-వ-రు? ఎవరు తల్లీ మీరు! యిదే దేశం?

వజిరా:— కోసలదేశం స్వామీ! మీకేమీ భయం లేదు. మేము మీ ఆప్తులం.

జీవ:—కో-స-ల-రా-జ్యం...చేరవలసిన చోటుకే తెచ్చి విడిచాడా భగవానుడు? అమ్మాయీ! యెవరమ్మా మీరు?

వజిరా:—నేను...పసేనది మహారాజుగారి కుమార్తెను-వజిరాకుమారిని.

జీవ:—ఆఁ? వజిరాకుమారి నీవేనా తల్లీ? నీవేనా?

వజిరా:—అవును స్వామీ! తమ నివాసంతో పవిత్రమైన రాజ్యం?

జీవ:—నేడు అపవిత్రమైపోయిన రాజగృహం.

వజిరా:—రాజగృహమా?

జీవ:—అవును తల్లీ! నేను అంతఃపుర వైద్యుణ్ణి-జీవకుణ్ణి.

వజిరా:—తమరేనా జీవకులు స్వామీ? మేము కలగంటూండడం లేదుగదా?

జీవ:—నేనేనమ్మా! ఆ దౌర్భాగ్యుణ్ణి నేనే.

వజిరా:—స్వామీ! జీవకులవార్ని పద్మావతి చంపించిందని వార్తవచ్చిందే?

జీవ:—చంప దలచింది నిజమేకాని, కప్పను మింగబోతూన్న కాలసర్పాన్ని యింతలో నెమిలి గుర్తించింది. రాజకుమారీ! స్వామి భక్తిపరాయణుడైన ఒక జీవకుడు చచ్చినా బ్రదికివున్నవాడే. పట్టపగలు చీకటికోసం ప్రాకులాడిన మరొక జీవకుడు బ్రదికివున్నా చచ్చినవాడే.

వజిరా:—స్వామీ! తమరేదో దుఃఖంతో వున్నట్టున్నారు. అంతఃపురానికి వెళదాం రండి! అక్కడ మాట్లాడుకోవచ్చు—నాన్నగారు మిమ్మల్ని చూచారంటే చాలా సంతోషిస్తారు. జీవకులు మాకు మళ్ళీ పుట్టివచ్చినట్లుంది.

జీవ:—కృతజ్ఞుణ్ణి రాజకుమారీ!

వజిరా:—[జీవకుణ్ణి పిలుచుకొని వెళ్ళుతూంటుంది]

[ప్రతి సీర]

[రాజగృహంలోని అంతఃపురం. బుద్ధ భగవానుడు ఆసనంమీద కూర్చొని వుంటాడు. పద్మావతీదేవి పాదాల దగ్గర కూర్చొని, కాళ్ళు కడిగి జలం తలమీద చల్లుకుం టుంది.]

పద్మా:—భగవానులు రేపు అంతఃపురభిక్ష నంగీక రించాలి.

బుద్ధ:—మహారాణీ! తక్కువ వేడికలిగిన శరీరంలో బంగారుబువ్వ జీర్ణం కాజాలదేమో.

పద్మా:—భగవాన్! తమరు విడ్డూరంగా మాట్లాడు తున్నారు.

బుద్ధ:—మహారాణీ! అజ్ఞానంతో కప్పబడిన మానవ జీవితాన్నావరించేది సుఖమో, దుఃఖమో చెప్పలేము.

పద్మా:—అంతఃపురభిక్ష శ్రీ శాస్తులకు యిష్టం లేనట్లుంది.

బుద్ధ:— తృణీకరించడం కాదు మహారాణీ! సూర్యమండలంలోని వెన్నను నేనారగించలేనేమో అని. వెలుగును చూచిచూచి కన్నులు గుడ్డివై పొయ్యాయి. చీకటి లోని వెలుగును దర్శించడానికే అనంతమైన యీ అంధకా రంలో ప్రవేశించాను.

పద్మా:—అంతఃపురమేదైనా పొరబాటు చేసివుంటే క్షమించ ప్రార్థన.

బుద్ధ:—మానవుల్ని క్షమించ గలిగింది మానవులు కారు. విశ్వ ప్రేమతో మార్దవమైపోయిన మనస్సు. మహారాణీ! [చిరునవ్వు] వేడిమేధస్సులోని నిప్పే నరకం-చల్లనిమేధస్సులోని చంద్రమండలమే స్వర్గం.

పద్మా:—మానవుడి తప్పులకు మనస్సులోని ఆశలే కారాణం కావచ్చు.

బుద్ధ:—కాని, నిండు వెన్నెలతో పొంగారుతూన్న తీయనిరాత్రిని కాలితో తన్ని, హింసాజ్వాలను కౌగలించుకొంటున్న ఫలితాన్ని మానవు లనుభవించక తప్పదు మహారాణీ!

పద్మా:—సామ్రాజ్యాన్ని శాసిస్తున్న చక్రవర్తిని నేను శాసిస్తున్నానని ప్రజలందరూ నామీద కత్తిగట్ట బోతున్నారట.

బుద్ధ:—పొరబాటుకాదు. పామువాసన పసిఋట్టే. ముంగిస వంటిది ప్రజాహృదయం.

పద్మా:—రాజు చేసేపనులకు రాణి బాధ్యురాలౌ తుందా భగవాన్ ?

బుద్ధ:—స్వార్థం కోసం సూర్యుడి వెలుగును అప్పు తెచ్చుకొంటుంది చంద్రమండలం. కాని,

పద్మా:—సందేహిస్తున్నారు.

బుద్ధ:— తేజసాంరాశి అంధకారంలో క్రుంగిపో తున్నాడు.

పద్మా:—మామగారు శైదీకావడానికి నేనే కారణమన్న అపవాదును భగవానులు కూడా నమ్ముతున్నారు.

బుద్ధ:—మహారాణీ! యిప్పుడిప్పుడే వెలుగును చూడగలుగుతున్నాను. మళ్ళీ అంధకారంలో కూలిపోలేను. ఆత్మలను ప్రేమకు అంకితంచేసి, కరకుకటార్లకు కంఠాలను కానుకయిచ్చే దయామయుల నెత్తురులో అమృత విశ్వాన్ని ముంచివెయ్యదలచిన కఠోర హృదయాలకు రాక్షసలోకంలోనే పారితోషికం. మానవలోకంలో అది కన్నీరు రాల్చవలసిందే.

పద్మా:—భగవానులు రాజకుటుంబాన్ని చాలా వాడిగా విమర్శిస్తున్నారు. శైశునాగుల హృదయాలు పాపాలకు చాల దూరం.

బుద్ధ:—మహారాణీ! అసత్యమే మానవుల అధోలోకం. నీలో యింత చీకటి నుంచుకొని ప్రపంచంలోని వెలుగు నార్పివేయడానికి ప్రయత్నిస్తున్నావు. లాభంలేదు. నీ కన్నుల్ని నువ్వు మూసుకోగలవే కాని, ఆకాశంలోని కోటి తారల్ని కప్పిపెట్టలేవు.

పద్మా:—నామాట తమరింకా నమ్మడంలేదు.

బుద్ధ:—మహారాణీ! నిరాశ నవ్వులో ఆశయేడ్పు—మృత్యు నిద్రలో అంతులేని శాంతి-ప్రకృతి నిర్మాణంలో భయంకర సంకల్పాలు. హింసతోకూడిన సాహసానికి జీవిత నరకం బహుమానం.

పద్మా:—మేము పాపాత్ములమని తమ అభిప్రాయమా?

బుద్ధ:——నీ–వు.

పద్మా:——నాకేపాపమూ తెలీదు భగవాన్.

బుద్ధ:——మహారాణీ! ఆత్మ అబద్ధమాడదు. మురికైపోయిన మనస్సునుండి పవిత్రమైన ఆత్మ వేరుపడి పోతుంది. ప్రాణిలోకానికి మానవుడు పడిన అప్పునూ వడ్డీనీ గుణిస్తూన్నది ఆ ఆత్మే. దాన్ని మోసగించలేవు.

పద్మా:—భగవాన్! తమ పాదాలను పూజించే రాణి వాసాన్నే తమ రనుమానిస్తున్నారు. పూజ్యపాదుల కడ కంటి చూపులోనే అంతఃపురానికి నిత్యమంగళమనుకున్నాను. దేవుడే మమ్మల్ని సందేహిస్తాడనుకోలేదు.

[కాళ్ళమీద పడుతుంది]

బుద్ధ:——లే తల్లీ! నీ హృదయం నిష్కల్మషమైతే, నీ జీవితంకూడా సుఖాంతమౌతుంది. మాగధ ప్రజలకు నువ్వు మాతవు. వాళ్ళను నీ గుండెల్లో దాచుకొని కాపాడు. మనస్సును నవనీతకోమలం చేసుకొని, నీ సామ్రాజ్యాన్ని పచ్చతోరణాలతో అలంకరించుకో—సె–ల–వు—

[వెళ్తాడు]

పద్మా:—[చేతిలో పళ్ళెరం జారిపోతుంది. నిర్విణ్ణగా అలాగే నిలబడిపోతుంది.]

[హజారంలో గంట]

[లోపల్నుండి——

మహారాణీ చక్రవర్తి.!]

పద్మా:—ఆఁ ?

[వీణ నెత్తుకొని పాడుతూ కూచుంటుంది.]

ఊదుమురా మురళీ - కన్నయ్యా !
ఊదుమురా మురళీ ! -
ఆమనివనిలో వలపురా చిలుక
కొలకొలనవ్వే నవ్వులరవళీ ॥ఊ॥

మల్లెకన్నెలో మసలు మరులతో
తేటికలువతో దెలుపు మొలలతో
భావవీచికల మేళవించి యిక ॥ఊ॥

హృదయసుమములో ఆశామధువులు
పొంగిపొరలగా నీరాధాసతి
తనజీవితమే నీకానుకగా
కోటిహారతుల దీయుచుండెరా ॥ఊ॥

తేనెకడలిపై తేలిపోవు మన
బ్రదుకుటోడనే ప్రళయా నిలమో
ముంచివేయుటకు మున్నె నీబిగి
కౌగిలిలోనను జోలబాడరా ॥ఊ॥

[అజాతశత్రువు మౌనంగా ప్రవేశిస్తాడు.]

పద్మా:—స్వాగతం చక్రవర్తులకు.

అజాత:—[పాన్పుమీాద కూర్చుంటాడు.]

పద్మా:—చ—క్ర—వ—ర్తీ—రా ను రా ను మీా ము ఖ మెందుకో సెలయేటి కోనై పోతూంది.

అజాత:—కాదు—శ్మశానమైపోతూంది. దానిలో మండుతూన్నవి పవిత్రమైన త్రేతాగ్నులు కావు—కోటిజీవుల్ని కడుపులో నింపుకున్న పీనుగుల మంటలు. యీ మంటల్లో నువ్వింక వెన్నెల చూడలేవు పద్మావతీ! మాకింక యీ సామ్రాజ్యమే అక్కర్లేదు. సన్న్యాసులమైపోతాం.

పద్మా:—ప్రభూ! ఆవులమందలో బట్టిపాల కేడుస్తున్నారు. కొంచెం విశ్రాంతి తీసుకోండి.

[ప్రక్కనున్న కంచు గంటనుకొడుతుంది. నర్తకి ప్రవేశించి మనోహరంగానాట్యం చేస్తూంటుంది. పరిచారిక వచ్చి మహారాణికి ఒకలేఖనిచ్చి వెళ్ళుతుంది. వెంటనే నర్తకికూడా నాట్యం పూర్తిచేసి వెళ్తుంది.]

అజాత:—పద్మావతీ! యేమిటది?

పద్మా:—[లేఖవిప్పి] స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శ్రీశ్రీశ్రీ అజాతశత్రు సార్వభౌముల సన్నిధికి—

కోసలదేవి మరణాంతరం కాశిలో తమ ప్రభుత్వమే నెలకొల్పబడిందని తెలియవచ్చింది. మాతాపితృద్రోహికి తలిదండ్రుల సంపదమీద అధికారం న్యాయవిరుద్ధమని ధర్మఘోష. నీతికోసం కాశిని మా కప్పగించడమో, యుద్ధానికి సంసిద్ధులు కావడమో ఘడియల్లో తెలపాలనిప్రార్థన.

ఇట్లు
స్నేహానుముఖి,
కోసలసింహపీఠి.

అజాత:—శ్రీముఖంలోని భాషే మారిపోయింది. మామగారు చాల బాగా బుద్ధిచెప్తున్నారు.

పద్మా:—తమరు మాతాపితృద్రోహులని యీ గడ్డిపోచ అన్నంతమాత్రానే నిజమైపోయిందా?

అజాత:—కాదు పద్మావతీ! మా మనస్సే వెయ్యినోళ్ళతో ఘోషిస్తూంది.

పద్మా:—తమ కర్తవ్యం?

అజాత:—తల్లిగారి పేరుతో కాశిని పసేనదికి దానం చేస్తాను.

పద్మా:—తర్వాత మనం సన్యాసులమైపోవచ్చును.

అజాత:—పద్మావతీ!

పద్మా:—పద్మావతి శవం కాలిపోయిన తర్వాత కాని, మీ మామగారి కోరిక నెరవేరడానికి వీల్లేదు.

అజాత:—[కంట తడిబెట్టుతూ] కన్నవాళ్ళను నేలబెట్టి కాలరాసిన దుర్మార్గుడికి వాళ్ళ ఆస్తిమీద మాత్రం అధికారమేముంది?

పద్మా:—యిదేనా రాజుల కర్తవ్యం?

అజాత:—రాజులకే కాదు—విశ్వప్రేమ మానవత్వానికే గురుతు.

పద్మా:—దానికి సన్యాసులు చాలరా? రాజులే కావల్నా?

అజాత :—పద్మావతీ! ధర్మాన్ని నిర్వహించవలసింది ప్రభుత్వమే. కత్తుల్తో కుత్తుకలు తరుగుతున్న రాజులు ధర్మ నిర్వహణకు అర్హులుకారు.

పద్మా :—మళ్ళీ మొదటికి వచ్చారు.

అజాత :—పద్మావతీ! యిది రాజకీయం.

పద్మా :—అర్థాంగిని,

అజాత :—ఆడదాని మంత్రాంగం మా కనవసరం.

పద్మా :—చాలకాలానికి బైటపడ్డారు ప్రభూ! ఇన్ని దినాలనుండీ మీాకంటికొక మంత్రవేత్తగా కనుపించిన నేను—నేడు కేవలం ఒక ఆడదాన్నైనాను కదూ? నిజం. యీా వేరుపురుగు మీా యింట్లో వున్నంతకాలం మీా బ్రతుకు ఎడారిలో గాలివానే కాని పూలవర్షం కురవబోదు. [అజాతశత్రువు ఒరలోని కత్తిని పెరికి అతని కేయిస్తూ] ప్రభూ! యిదిగో—మిమ్మల్ని దుఃఖ సాగరంలోముంచిన రక్కసిని మీా చేతుల్తోనే తొలగించుకోండి! కానివ్వండి! [కాళ్ళ మీాద పడుతుంది].

అజాత :—[నివ్వెఱపోయి లేవనెత్తుతూ] పద్మావతీ! దుఃఖావేశంలో శరీరం తెలియక అలా అన్నానుకాని, నీ అంగీకారం లేకుండా రాజ గృహంలో రవ్వనైనా కదిలించానా?

పద్మా :—నిజమా?

అజాత :—కన్న తండ్రినికూడా చెఱ బెట్టించాను.

పద్మా :—ఎవరికోసం ?

అజాత :—.........మా-కో-స-మే.

పద్మా :—అలాగైతే—కాశిని వదలిపెట్టడానికి వీల్లేదని శ్రావస్తికి తక్షణం వర్తమానం పంపండి!

అజాత :—పద్మావతీ! అనవసర కలహం రాజ్యశాంతికి భంగం కలిగిస్తుంది. నెత్తురు కండ్ల జూడడానికి మా కిష్టం కావడంలేదు.

పద్మా:—యీ వేదాంతం సన్న్యాసులకుగాని, సార్వభౌములకు కాదు. రాజగృహరాణులు—కదనరంగాలను కత్తులకు మాటలు నేర్పే పాఠశాలలుగా చేసిన వీరులకు మాతలుకాని, అశక్తితో అహింసామంత్రం జపించే భీరువులకుకాదు. శక్తిలేకుంటే మీరు అంతఃపురంలోనే ఉండండి! రాజగృహం మీదికి యే మొనగాడు దండెత్తి వస్తాడో చూస్తాను.

అజాత :—పద్మావతీ! బంధువుల్ని చంపి రాజ్యం నిలబెట్టుకోవడం నా కిష్టంలేదు. పసేనది మనకు పరాయివాడుకాడు. మేము జన్మించింది అతని యెంగిలి పాలు త్రాగిన తల్లికే.

పద్మా :—ప్రభూ! క్షాత్రధర్మానికీ బంధుత్వానికీ ఉత్తరదక్షిణధృవాల కున్నంత దూరం. యింతమాత్రం మెదిరించలేక కోరి కోరకముందే కాశిని మామగారి కర్పించిన దుర్బలులని మన ప్రజలేకాదు—రాజగృహంమీద

తిరుగాడుతూన్న కాకులుకూడా నవ్వుతాయి. నామాట వినండి! ప్రభువులకు శౌర్యం చూపించడమే కర్తవ్యం.

అజాత :—త-ప్ప-దా ?

[లోపల్నుండి]

"యతోన కశ్చిత్క్వచ కుత్ర విద్వాణ

అజాత :—ఆగినవర్షం మళ్ళీ విజృంభిస్తుందా ?

పద్మా :—మన మర్యాద మట్టి పాలు ప్రభూ !

[లోపల్నుండి]

"దీన స్వమాత్మానమలం సమర్థః
విమోచితుం

అజాత :—అనురాగం దౌర్బల్యంలోనుండి పుడుతుందా ?

పద్మా :—మీ అభిప్రాయాన్ని మార్చుకోరా ?

[లోపల్నుండి]

"కామ దృశాంవిహార
క్రీడామృగో

అజాత :—మేము పొరబడుతూండడం లేదుకదా ?

పద్మా :—శైశునాగ ఖడ్గానికి మరొక్కవిందు ప్రభూ !

[లోపల్నుండి]

"విహార
క్రీడా మృగోయన్ని గళో విసర్గః"*

[ప్రతిసీర]

* వ్యాస భాగవతంనుండి.

[శ్రావస్తిలోని అంతఃపురం. గవాక్షంలోనుండి వెన్నెల కొంచం కొంచంగా లోపలికి వస్తూంటుంది. వజిరా కుమారి గవాక్షంలోనుండి బైటికి చూస్తూంటుంది. జీవకుడు ఆసనంమీద కూర్చొని తంబుర మీటుతూంటాడు.]

వజిరా :—గురుదేవా! చంద్ర మండలంలోకూడా యిన్ని అగ్ని పర్వతా లున్నాయా?

జీవ :—ఉక్కగా వుందేమో—ఆలావుద్యానంలోకి వెళ్ళి రామ్మా!

వజిరా :—ఆ వెలుగు యేడుపులోని ఆనందంకన్నా యీ చీకటి నవ్వులోని బాధే చాలా అందంగావుంది గురుదేవా! అదుగో-నా-గు-బా-ము...పక్షిగూటిలోని గుడ్లను దొంగిలిస్తూంది. అబ్బ...ఆ నాగుబామును నెమిలి వేటాడుతూంది—హింస - విముక్తి పోరాటం - ఆ నందనందనం శ్మశాన మైపోతూంది. గాలికి రెపరెపలాడిన మందారం సమాధి అయిపోయింది.

జీవ :—అనవసరంగా కలత పెట్టుకోవద్దమ్మా! యేదన్నా చదువుకో.

వజిరా :—గురుదేవా! యెందుకో భయంకరమైన భావాలు మనస్సును యెడారిగా మార్చివేస్తున్నాయి.

[పుస్తకపీఠం దగ్గర కూర్చొని శ్లోకం చదువుతూంటుంది.]

రాత్రిర్గమిష్యతి; భవిష్యతి సుప్రభాతం;
భాస్వా నుదేష్యతి; హసిష్యతి పంకజశ్రీ;
యిత్థం విచి న్తయతి కోశ గతే ద్విరేఫే
హా! హ న్త!! హ న్త!!! వళినీంగజ ఉజ్జహార.†

[ఉన్నత స్థాయికిపోయి, ఉద్రేకంలో పాడలేక స్పృహతప్పి క్రింద పడిపోతుంది. తటాల్న జీవకుడిచేతిలోవున్న తంబుర జారిపోతుంది. గబగబా వజిరా దగ్గరికివచ్చి, పరీక్షించి, యేదో ఆలోచనతట్టి, మళ్ళీ ఆసనంమీాదికి వెళ్ళి తంబుర మీాటుతూ భావగీతం ఆలపిస్తాడు జీవకుడు.]

జీవ:—అహో! విభావరీ!
వజిరా!—ఇదేమి విలయమో!
జీవ:—అహో! విభావరీ!
వజిరా:—కలువ సోదరి కన్నులు మోడ్చె
నింగిదేవత కన్నీరోడ్చె
అవి యేవో సొదలో
బందీలోనా
భృంగకూరుల రొదలో
వీవకుమా పైరగాలీ!
జీవ:—నిలువకుమా! పైరగాలీ!
మొగిలిపూ మగువ బంగరు పయ్యెదసాచె
లేత తెమ్మెర పుప్పొడి తావులవీచె
యిది ప్రశాంత లోకంబో
అంటే యంటవి

పూలతోటల నాకంబో
నిలువకుమా పైరగాలీ!
వజిరా:—వీవకుమా పైరగాలీ!
అశోక శోకమో
జీవ:—అంభోదిహాసమో
వజిరా:—ప్రకృతి మోసమో
జీవ:—చంద్రికా హాసమో
నిలువకుమా పైరగాలీ!
వజిరా:—వీవకుమా పైరగాలీ! వీవకుమా పైరగాలీ!
వజిరా:-వీవకుమా పైరగాలీ! వీవకుమా పైరగాలీ!

[చేతిలో ఒక లేఖ నుంచుకొని పసేనది ప్రవేశిస్తాడు]

పసే:—జీవకా! చూచారా యీ స్త్రీముఖం? యీ మూర్ఖుడు యుద్ధం చేయ్యడానికే నిశ్చయించుకున్నాడు.

జీవ:—ప్ర-భూ?

పసే:—తల్లిగారి ఆస్తిమీద కుమారుడికి అన్ని హక్కులూ వున్నాయట. రాజగృహాన్ని నెత్తురు కాలువలు చెయ్యక తప్పదు. రేపే దండెత్తడానికి నిశ్చయించుకున్నాం.

జీవ:—గాలివాన ప్రారంభమైంది. ప్రపంచం యిక నెత్తుర్లో స్నానంచెయ్యక తప్పదేమో.

వజిరా:—నాన్నా! రాజగృహంమీదికి దండెత్తి పోవల్సిందేనా?

పసే:—పసేనది చేతిలో ఖడ్గమున్నంతవఱకూ కాశీ మీద మగధ పతాక యెగరడానికి వీల్లేదు.

వజిరా :—గురుదేవులతో కలిసి మేముకూడా రాజగృహం రావడానికి అనుజ్ఞ యివ్వాలి.

పసే :—కుమారీ! అది వియ్యంకాదు—కయ్యం

వజిరా :—అభిలాషగావుంది.

పసే :—మీ యిష్టం.

వజిరా :— [వెళ్ళుంది]

పసే :—జీవకా! రాజగృహంమీద మేము చెయ్యబోయ్యే దాడికి మీ అభ్యంతరం యేమైనా వుందా ?

జీవ :—రాజగృహం జీవకుడి జన్మభూమి ప్రభూ! ధర్మ సంకటంతో మెదడు నజ్జు నజ్జై పోతూంది.

పసే :—అధర్మంతో, దుర్మార్గంతో, హింసతో మీ జన్మభూమి శిథిలమై పోవడం మీకు సమ్మతమేనా ?

జీవ :—నన్ను పెంచి పెద్దచేసిన రాజ్యంమీదికి నా అంగీకారంతో సేనల్ని పంపలేను ప్రభూ!

పసే :—జీవకా! మీ ప్రాణాల్ని బలి చేసుకోవడానికి ప్రయత్నించి, మిమ్మల్ని దేశాంతరాల పాలుచేసిన బానిసత్వం జన్మభూమిలో అయినా నరకంతో సమానమే.

జీవ :—నిజం పలికినారు ప్రభూ! పారతంత్ర్యం నెత్తురు పిండుతూన్న జన్మభూమిలో పీనుగులా తిరగడం కంటే స్వాతంత్ర్యమిచ్చే పరదేశంలో అడుక్కు తినడం మంచిది. కాని, కన్న రాజ్యంమీదికి పరాయిసేనల్ని

తెచ్చిన మాతృ ద్రోహినని దేశద్రోహులు నన్ను నిందిస్తా రేమో.

పసే:- జీవకా! బానిసత్వపు నరకాన్ని స్వతంత్ర స్వర్గంగా మార్చగలిగిన వీరుడు ఒక దేశంలో ఒక్కడే జన్మిస్తాడు. నిన్ను నిందించే దేశ ద్రోహులుకూడా నువ్వు సంపాదించే స్వాతంత్ర్య శాంతిలో రేపు భాగం పంచు కుంటారు.

జీవ :—అధర్మాన్ని నిరాయుధంగా యెదుర్కొని ప్రాణాలను బలిదానంచేయడం బుద్ధ భగవానుల పవిత్ర సందేశం.

పసే :—గొంతులు కోస్తున్న ప్రభుత్వం నీ అహింసా వ్రతంతో తెలివి తెచ్చుకోవడానికి కొన్ని శతా బ్దాలు గడిచిపోవాలి. మదపుటేనుగు ములుకర్రతో మాట వింటుందా? జీవకా! రాజగృహం నాకు పరాయి రాజ్యం కాదు. అజాత శత్రువును ఓడించి వాని రాజ్యాన్నా క్రమించుకోవడం నా అభిప్రాయంకాదు. అతణ్ణి బాగు చెయ్యగలమేమో అని. మీకు భయంలేదు. మమ్మల్ని దీవించండి!

జీవ :—ప్రళయం తర్వాత కాని పునస్సృష్టి ప్రారంభం కాదేమో. వెళ్ళిరండి ప్రభూ! తమదే విజయం.

పసే :—సెలవు. [నమస్కరించి వెళ్తాడు.]

[వజిరా వచ్చి వస్తుంది.]

వజిరా :—గురుదేవా! మనం యిప్పుడే కొంతపరివారంతో రాజగృహంవెళ్ళి మామగార్ని సంధి కొప్పించడానికి ప్రయత్నిస్తే?

జీవ :—ఇది నీటి శక్తికి మించిన నిప్పు తల్లీ! దీన్ని ఆర్పడానికి ప్రయత్నించిన నీరు ఆవిరై పోవలసిందేకాని, ఆశ ఫలించదు. రాజకుమారీ! భయపడవద్దు. నీ కోరిక నెరవేరితేనే రాజగృహానికి శాంతి.

వజిరా :—గురుదేవా! కత్తులు కత్తులు రాపాడబోతూన్న యీ విలయంలో నా కోరిక నెరవేరడానికి తావుందా?

జీవ :—రాజకుమారీ! మెఱుపు తళుకులు మేఘాలావరించినప్పుడే. అజాత శత్రువుకు నువ్వు రెండవ ధర్మపత్నివి. ప్రయాణాని కేర్పాటు చెయ్యించు [వెళ్తాడు]

వజిరా :—నింగి పొలమున మల్లె పందిళ్ళపైచి
బాల చంద్రునిఁగావుంచె ప్రకృతిలక్ష్మి;
కాలమేఘమా! నీకుఁ బోగాలమేమి?
ఉట్టిపడి యాక్రమించితి వొకక్షణమున.

[వెళ్తోంటుంది.]

[ప్రతిసీర]

[రాజగృహం. అజాతశత్రువు పడకగది. పడకకు దగ్గరగా ఒక చిన్న లోహస్థంభం మీద దీపం అస్పష్టంగా వెలుగుతూంటుంది. అజాతశత్రువు పాన్పుమీద పొల్లుతూ, నిద్రలో కలవరిస్తూంటాడు.]

అజాత:—పద్మా-వ-తీ—క్రోతి - - - - ఏదీ శూలం?-శూ-లం-శూ—[దొల్లిపోతాడు] ఆ? యెన్నడూ లేని విపరీతం-క్రోతి మూకల పరిహాసం - - - దీనికర్థం?- [దూరాన సద్దవుతుంది. తటాల్న శూలం చేతికందుకొని] ఎవరక్కడ? [అరుస్తాడు. యీ అరుపు విని, వెనకవైపున వున్న ద్వారం దగ్గరకు పద్మావతి పరుగెత్తుకొని వస్తుంది. ఇంతలో జీవకుడి వేషంలో వున్న వజిరా అజాతశత్రువును సమీపిస్తుంది. యిది చూచి పద్మావతీదేవి దిగిరాకుండా అక్కడే ఆగిపోయి, నిప్పులు కక్కుతూంటుంది.]

వజిరా:—ప్ర-భూ!

అజాత:—జీవకా! జీవకా! [ఆనందంతో వజిరాను కౌగిలించుకొంటాడు]

వజిరా:—[పారవశ్యంతో] ప్ర-భూ!

అజాత:—జీవకా!

వజిరా:—ప్రభూ! యీ కౌగిలిలో అంతమైపోయిన జన్మ యెంత పునీతమో.

అజాత:—జీవకా! యిది స్వప్నమా? యదార్థమా?

వజిరా:—స్వప్నంలాగే తారసిల్లిన యదార్థం ప్రభూ!
[రహస్యంగా వీర్ని చూస్తూండిన పద్మావతి ఆవేశంతో వెళ్ళిపోతుంది.]

అజాత:—జీవకా! తమ కంఠం యీలా మారిపో యిందేం?

వజిరా:—[వ్రేలు గరచుకొని] ప్రభూ! క్షమించండి! నేను వజిరాను. జీవకుడి వేషంతో అంతఃపురం ప్రవేశించాను. [వేషం తీసేస్తుంది]

అజాత:—వ-జి-రా!

వజిరా:—అబ్బ-మీ నోటినుండి నా పేరు యెన్ని దినాలకు వినగలిగేను ప్రభూ!

అజాత:—వజిరా! శ్రావస్తినుండి నువ్వొక్కదానివే వచ్చావా?

వజిరా:—లేదు ప్రభూ! పరివారంతో.

అజాత:—వర్తమానమంపి రాకూడదా?

వజిరా:—మర్యాదలకిది సమయంకాదు. తండ్రి గారు దండెత్తివస్తూన్నారు.

అజాత:—ఆఁ?

వజిరా:—గాలివీస్తే యీ కారుమబ్బులు కనురెప్పపాట్లో కదలిపోగలవు.

అజాత:—అసంభవం. ఆవరించిన తర్వాత కుంభవర్షం కురవ్వాలసిందే.

వజిరా:—ప్రభూ! యీ రక్త ప్రవాహాన్నరికట్టి శాంతి నెలకొల్పగలమని గంపెడాశతో వచ్చాను.

అజాత:—వజిరా! నీ ఆశవృథా. రేపు జరగబోయే యుద్ధంలో, మీనాన్నో, ప్రియుడో పరాజయం పొందక తప్పదు.

వజిరా:—ప్రభూ! యేమైనా కానివ్వండి. యీ హృదయంలో యింకొకరికి తావులేదు. వజిరా వివాహిత అయితే మీ ధర్మపత్ని-కాదా-యావజ్జీవ బ్రహ్మచారిణి.

అజాత:—నీకింకా ఆ ఆశవుందా వజిరా! అజాతశత్రువు యీనాడు మీకు శత్రువు. మామగారు మహాకఠినుడు. నిన్ను చంపిఆయినా పారివేస్తాడు కాని, మాకివ్వడానికి మాత్రం ఒప్పుకోడు.

వజిరా:—పొరబడుతూన్నారు. కన్న తండ్రిని యీలా ఆల్లాడిస్తున్నారన్న కోపంతో ఆయన యింత కఠినుడై పొయ్యాడు కాని, మీమీద ప్రేమలేక కాదు.

అజాత:—వజిరా! మాకంతా తెలుసు. తప్పుచేశామని తనకు తోచివుంటే, మా చెల్లెలి రాజ్యం మాకు కావాలని పెద్దమనిషిలాగు ఆజ్ఞాపించి వుండవచ్చు. యివ్వమని మేమన్న తర్వాత కదా యుద్ధం మాట తలపెట్టవలసింది? శైశునాగ వంశం గాజులు తొడుక్కున్నదనుకున్నారా?

వజిరా:—బంధువుల మధ్య యీ కలహం శ్రేయస్కరం కాదేమో.

అజాత:—రాయబారం మోసుకొచ్చావన్న మాట.

వజిరా:—రెండు రాజ్యాల క్షేమంకోరి చెప్తున్నాను. నాకోసమైనా మీరు కాశిని విడువలేరా ?

అజాత:—ఒక్క కాశినే కాదు. మీ తండ్రికి రాజ్యం మీద ఆశవుంటే ---- నా సర్వస్వం దానంచేస్తాను. కాని, యుద్ధమన్న తర్వాత చేసితీరవలసిందే. అటో-యిటో. యింతవరకూ వచ్చిన యుద్ధాన్ని ఆడవాళ్ళలాగా ఉపసంహరించుకుంటే మా రాజ్యంలో మా అధికారమే కాదు-ఆత్మ గౌరవం కూడా నవ్వులపాలవుతుంది. నీకు నేను కావాల్నా? నీ తండ్రినే సంధికొప్పించు. లేదా ? విధి బలీయమౌతుంది. నా ప్రేమ మాత్రం నీకెన్నటికీ కొరత చెయ్యను.

వజిరా:—[కన్నీటితో] మీరు పెంచిన పువ్వుమీద మీరే నిప్పులు పోస్తున్నారా ? ఇదిగో-అది మీపాదాలకే కానుక. ఆ కాలితోనే నలిపివెయ్యండి.

[పాదాలంటుతుంది]

అజాత :—[లేవనెత్తి] ఏడవకు వజిరా! నేనిప్పుడు నిర్వహిస్తున్నది ప్రణయధర్మంకాదు, క్షత్రియ ధర్మం. నన్ను నిష్ఠూరమాడవద్దు. నీమీద నాకు ప్రేమ లేక కాదు. విధిలేదు. నీకు అదృష్టముంటే నీ తండ్రికే మంచిబుద్ధి పుడుతుంది. [ముఖం అటువైపు త్రిప్పుకొంటాడు.]

వజిరా :—రాజనీతికీ, నిసర్గప్రేమకూ సంబంధమే కూర్చలేదా హృదయం ?

అజాత :—[ముఖం త్రిప్పకుండా నే] వజిరా! ఆ రెండు కొండల మధ్యవున్న వాగులో మేము దిక్కుతోచకుండా కొట్టుకొనిపోతూన్నాం. ఇక బాధించవద్దు.

వజిరా :—పోతూన్నాను ప్రభూ! ప్ర–ణా–మం.

ప్రకృతి చిత్రకారిణి వ్యోమ పటమునందు
ముదిర మిథున పరీరంభ మూర్తి వ్రాసె
ముక్కడి తుపానులో అది ముక్కలయ్యె
తపము జేసెద మఱల అద్దానిగనగ.

[వెళ్తుంది[

అజాత :—నిష్కళంక అయిన పద్మిని సూర్యోదయంకోసమే యెదురుచూస్తోంది. ప్రేమభిక్ష గోరివచ్చిన ఒక ప్రణయినికి యింత భిక్ష వెయ్యలేని దరిద్రుణ్ణి. [తల మోదుకుంటూ] అజాత శత్రువు జీవిత ద్వీపానికి నలువైపులా దుఃఖసముద్రమే.

[పడకమీాద కూలిపోతాడు.]

[నేపథ్యంలో—యుద్ధభేరి. ''ప్రభూ! ప్రభూ!'' అన్న కేక. అజాతశత్రువు ఏమీా తోచక—చలించి పోతూన్న చూపుల్తో నలువైపులా పరికిస్తాడు.]

ఎవరు?

[సన్నిధాత సంభ్రమంతో పరుగెత్తుకొని వస్తాడు.]

స:— ప్రభూ!

అ:— సన్నిధాతా!

స:—ప్రభూ! కోసలవాహిని రాజగృహం మీదికి దండెత్తివచ్చింది.

అ:— .........

స:— తెల్లవారేసరికి యుద్ధం ప్రకటించబోతున్నారట.

అ:— .........

స.—ఆజ్ఞ ?

అ:—యుద్ధమే.

స:—ప్రభూ! దండెత్తివచ్చింది కోసలమహారాజు—

అ:—ఎరుగుదుము.

స:—నా కర్థం కావడంలేదు ప్రభూ!

అ:—సన్నిధాతా! తెల్లవారేసరికి మాగధ సైన్యాలు యుద్ధానికి సంసిద్ధం కావాలి.

స:—కోసలపతి తమమామగారన్న సంగతి మఱచిపోయారేమో.

అ:—కాదు—తన అల్లుడు అజాత శత్రువన్న సంగతి కోసలపతి మఱచిపోయినట్లుంది.

స:—భారతదేశానికి మఱొక భారత యుద్ధం సంప్రాప్తం కాదుగదా?

అ:—భారతయుద్ధమేకాదు - ప్రపంచ ప్రళయమైనా సరే, రాజగృహ యుద్ధరంగం రక్తమయం కావలసిందే. అజాతశత్రువు కత్తిమీది తేనెను కోసలపతి నాలుక చవి

చూడ వలసిందే. అక్రమమైన యీ ఆక్రమణకు రాజగృహం కోసలకు బుద్ధి చెప్పవలసిందే. తప్పదు.

స:—ప్రభూ! పౌరుషంతో పెరిగిన మీ మేధలో పగమాత్రమే వీరవిహారం చేస్తోంది.

అ:— సన్నిధాతా! శైశునాగ పౌరుషం ఉన్నత శిఖరిమీదనుండి నిలువునా కూలిపోవడమే నీ ఆశయమా?

స:—కాదుప్రభూ! ప్రశాంత జీవనాని కలవాటు పడిపోయిన మన సైన్యం చాలా దుర్బలస్థితిలో ఉంది.

అ:—ఆ పిరికిమాట నీ పౌరుషానికే కాదు—శైశునాగ సామ్రాజ్య గౌరవానికి కూడా తలవంపు.

స:—పరిస్థితుల్ని గమనించకుండా తమరు పౌరుషాన్ని మాత్రం గౌరవిస్తున్నారు. మగధసైన్యం అనంతమైనా అజాగ్రత్తతో నిద్రపోతూంది.

అ:—భయపడ నవసరంలేదు. మగధ వీరుల కంఠాలలోని కడపటి నెత్తురుచుక్క నేల చిందేవఱకూ కత్తిని దింపకూడదు. విజయమైనా సరే—వీర మరణమైనా సరే.

స:— ప్రభూ!

అ:— మా ఆజ్ఞ.

స:—తమ బంధువుల గొంతులమీదనే మమ్మల్ని కత్తి పెట్టమంటున్నారా?

అ:— శత్రువై దండెత్తివచ్చిన ద్రోహిని మాకు బంధువని మే మేనాటికీ మన్నించం. యుద్ధంచేసి తీరవలసిందే.

స:—తన గుండెలోని అనురాగ సరస్సునుండి రాజగృహ హృదయంలోనికి కాలువలు తీసుకొన్న కోసలమీాఁదయీా సేవకుడు కత్తి విసరలేడు ప్రభూ!

అ:— సన్నిధాతా! కృతఘ్నుడివి కావద్దు.

స:— క్షమించండి. ఈ బంధు కలహాన్ని రూపుమాపడం నా ఆశయం.

అ:—అది నీ అధికారానికి వ్యతిరేకం-అనవసరం.

స:— మిమ్మల్ని చేతులారా యెత్తి, ముద్దు పెట్టుకొన్న కోసలపతి మీాదికి నా కత్తి పరుగెత్తలేదు ప్రభూ?

అ:—ఆ ధర్మభీతి నీకక్కర్లేదు. స్వామికార్య నిర్వహణ మాత్రమే నీ కర్తవ్యం.

స:—కాని, చేసినపాపం సేవకుణ్ణి మాత్రమే కౌగిలించు కొంటుంది ప్రభూ!

అ:— సన్నిధాతా! నువ్వు వచ్చింది రాజకీయ సమాలోచనకా? వేదాంతోపన్యాసానికా?

స:—[మాఱు మాట్లడకుండా ఒరలోనుండి కత్తిదీసి సమ్రాట్టుకు సమర్పిస్తూ] క్షమించండి! నేను వచ్చింది దీనికి.

అ:—దేనికి

స:—తమరు ప్రసాదించిన అధికారాన్ని మళ్ళీ తమకే సమర్పించుకోవడానికి.

అ:— ఎదురు తిరుగుతున్నావా?

స:—నా హృదయమే నాకు ఎదురు తిరుగుతూంది ప్రభూ!

అ:—స్వామి—ద్రోహం—

స:—కాదు—ఆత్మద్రోహంనుండి విముక్తి పొందా లని ప్రయత్నిస్తున్నాను. ఇదిగో! సన్నిధాత అధికారాన్ని ఉపసంహరించండి! యీ నెత్తురుకూడు తిని యిక జీవించ లేను.

అ:— మగధ సామ్రాట్టు ముందు మాట్లాడడం సేనాపతేనా?

స:— యిప్పుడు మాట్లాడుతూండడం—సమ్రాట్టు మెదడులోనుండి ప్రవహించే కోటి గొంతుల రక్తం కోసం దోసిలి చాపుతున్న సేనాపతి కాదుప్రభూ! అనాగరిక ప్రపం చాన్ని దాటి, ఆనందప్రకృతిలో సత్యజ్యోతిని దర్శించు కొన్న స-న్ని-ధా-త.

అ:— సన్నిధాతా? ఆలోచించుకో! నీ చేతిలోని నాయకదండం నేల తాకిన తర్వాత, మళ్ళీ నీకా అధికారం రావడం అసంభవ మౌతుంది. జాగ్రత.

స—అక్కర్లేదనే తమర్ని ప్రార్థిస్తున్నాను. అధర్మ సమరంలో నా భుజబలాన్ని ఉపయోగించి, హింసకూ అన్యాయానికీ విజయం సాధించిపెట్టలేను.

అ:—ఏమన్నావు? హింస—అన్యాయం—ఎవరిది?

స:— రాజగృహ గర్భంలో ప్రళయ తాండవం చేస్తున్న రాక్షసిది.

అ:— సన్నిధాతా! నువ్వు యింత అజ్ఞానివని మే మెప్పుడూ అనుకోలేదు.

స:—యీా ప్రభుత్వం యింత నిరంకుశ మౌతుందని నేనూ అనుకోలేదు.

అ:— నేరానికి ప్రభుత్వం విధించే శిక్ష నిరంకుశత్వమే అయితే నిమిష నిమిషానికీ ప్రపంచ విప్లవం తప్పదు.

స:— పొరబాటు ప్రభూ! పసిపాపచూపు మూతలు పడ్డ కనుఱెప్పల్లోని ఱీకటిరంగులవఱకే పరుగెత్తుతుంది.

అ:— సన్నిధాతా! రాజగృహం అధర్మంతో మలిన మైపోయిందనా నీ అభిప్రాయం?

స:— అవునుప్రభూ!

అ:—పొరబాటు.

స:—ప్రభుత్వాన్ని విమర్శించగలిగిన ప్రజాదృష్టిలో పొరబాటు కలుగుతుందనుకోవడమే ప్రభుత్వం చేస్తున్న పెద్ద పొరబాటు. శాంతివాంఛతో ఏకమైపోయిన కోటి హృదయాలముందు ధర్మానికి అంకితమైన ఒక అమృత జ్యోతి యెప్పుడూ ప్రకాశిస్తూంటుంది ప్రభూ! ప్రజాశాంతికీ, ప్రజా వాంఛకూ భంగంకలిగించటం ప్రభుత్వ ధర్మం కాదు.

అ:—సన్నిధాతా! నీ విమర్శ మాకు అయోమయంగా కనిపిస్తూంది.

స:—ప్రపంచాభ్యుదయాన్ని రూపుమాపే యుద్ధానికి ప్రజలు ఏనాటికీ సహాయం చెయ్యరు ప్రభూ!

అ:—ప్రభువు ప్రజల తందనాలకు దరువువేసే బానిస కాడు.

స:—మానవలోకానికి శాంతి కలిగించలేని ప్రభుత్వం అడవి మృగాలమీద అధికారం చెలాయించవచ్చు.

అ:—ఆఁ? సన్నిధాతా! అధికప్రసంగం అనవసరం. ఖడ్గాన్ని స్వీకరించి సేవక ధర్మాన్ని నిర్వహిస్తావా? ఎదురు తిరిగి అజాత శత్రువును అసహాయ శూరుణ్ణిగా చేస్తావా?

స:—ప్రభూ! తమరు తలపెట్టింది ధర్మయుద్ధమేనా? ప్రజాక్షేమం కోసం—ప్రజల కోరికతో నిర్ణయింపబడిందేనా? ఏ అభ్యుదయం కోసం—ఏ శాంతి కోసం యీ యుద్ధాన్ని తలపెట్టేరో సెలవివ్వండి!

అ:—సన్నిధాతా! నువ్వు సేనాపతివి మాత్రమే. ఆ మీమాంసనీ కనవసరం.

స:—క్షమించండి! నేను సేనాపతిగా మాట్లాడడం లేదు. మగధ ప్రభుత్వం ప్రజానీకం మీద విసురుతూన్న నిప్పు కణికల్లో బ్రతుకును కాల్చుకునే పౌరుడిలా మాట్లాడుతూన్నాను.

అ:—మగధ సామ్రాజ్య రక్షణ కోసమే యీ యుద్ధాన్ని తలపెట్టేము.

స:—ప్రభూ! జీవకుల వారిని చంపించడానికి ప్రయత్నించడం కూడా మగధ సామ్రాజ్య రక్షణకోసమేనా?

అ:—ఆఁ? జీవకులవారిని--ఎవరు?

స:—కన్న తండ్రిని కారాగృహంలో బంధించి, మలమల మాడ్చి చంపడానికి ప్రయత్నిస్తూండడం కూడా మగధ సామ్రాజ్య రక్షణకోసమేనా? రాణివాసాన్ని తృప్తి

పరచడం కోసం—మనసిచ్చి మన్నించిన మేనమామ మీాద యుద్ధం ప్రకటించి, ప్రజా జీవనాన్ని అశాంతికి ఆహుతి చెయ్యడం కూడా మగధ సామ్రాజ్య రక్షణకోసమేనా?

అ:—సన్నిధాతా! నిన్ను శాసిస్తున్నాం.

స:—సేనాపతిని శాసించగలరు—సన్నిధాతను శాసించలేరు.

అ:—నీ అధికారాన్ని ఉపసంహరించడానికి వీల్లేదు. నువ్వు సైన్యాన్ని నడిపించక తప్పదు.

స:—ప్రభూ! ప్రజాశక్తి ప్రభుత్వానికి సహాయం చేసిన సాధనం సైన్యం. అనంతమైన ఆ ప్రజా సేనను నీచమైన కుటుంబ కలహాలలో నడిపి, అమూల్యమైన ప్రజా రక్తాన్ని అనవసరంగా ఖర్చుపెట్టించలేను. క్షమించండి! యిదిగో! తమరిచ్చిన అధికారాన్ని తిరిగి తమకే ఒప్పజెప్పుతున్నాను.

[కత్తిని సమ్రాట్టు పాదాలదగ్గఱ వదుల్తాడు]

అ:— సే-నా-ప-తీ!

స:—కాదు—సన్నిధాతా అని పిలవండి!

అ:—మమ్మల్ని ధిక్కరిస్తున్నావు.

స:—మిమ్మల్ని కాదు ప్రభూ! అధర్మంతో తుప్పపట్టిన మీా రాజదండాన్ని. యిప్పుడు సన్నిధాత మగధ ప్రభుత్వానికి సేవకుడు కాడు. అ-జా-త-శ-త్రు-వు-ల అనుగు చెలికాడు. వందే! యీా మిత్రుడికి సెలవివ్వండి!

[వెళ్తూంటాడు.]

అ:—సన్నిధాతా! సన్నిధాతా!!

స:— [వెళ్తాడు]

అ:—ఎదురు తిరిగింది-- ఎదురు తిరిగింది--సమ్రాట్టు పరుగులకు సామ్రాజ్య ప్రజ సర్వమూ ఎదురు తిరిగింది-- కాదు-ప్రపంచమే యెదురు తిరిగింది--అజాతశత్రువు జీవితంలో హఠాత్తుగా యీ ప్రళయం సంభవించడానికి కారణం? [తల మోదుకుంటూ] ఏమో-- ఏమో--- ఏమో — — —

[వెళ్తాడు]

[ప్రతిసీర]

[రాజగృహంలోని అంతఃపురం. పద్మావతీదేవి ఆలోచిస్తూ అటూ యిటూ తిరుగుతూంటుంది.]

పద్మా :—కోసలరాజును పురికొల్పి, రాజగృహం మీదికి దండు తీసుకువచ్చింది యీ మాతృద్రోహేనా? సన్నిధాత నన్నేమార్చేడేమో........జీవకుడు జీవించి వుండడం నిజమే అయితే, సన్నిధాతకూడా యీ మంటలో మసి. [లోపలికిచూచి] ఎవరక్కడ? సన్నిధాతా!

[లోపల్నుండి—

మహారాణీ!]

[సన్నిధాత ప్రవేశిస్తాడు]

సన్ని :—ప్రణామం మహారాణీకి.

పద్మా :—[కండ్లెఱ్ఱజేస్తూ] సన్నిధాతా! నువ్వా నాడు జీవకుణ్ణి చంపి వచ్చింది నిజమేనా?

సన్ని :—...........

పద్మా :—ప్రత్యుత్తర మిస్తావా లేదా?

సన్ని :—చంపలేదు.

పద్మా :—నువ్వా నాటి రాత్రి నాకు చూపించిన రక్తం?

సన్ని :—తప్పించుకోవడానికి పన్నిన వుపాయం.

పద్మా :—తలబిరుసు సమాధానాలు కట్టిపెట్టాలి. నువ్వు మాట్లాడుతూన్నది పద్మావతీదేవితో. జాగ్రత.

సన్ని :— అహ్హాహ్హాహ్హా— మహారాణీ! కోపం వచ్చిందా నామీద? భయంలేదు. చన్నీళ్లలో మునిగిన తర్వాత చలికి జంకను.

పద్మా :— చంపిరమ్మనికదా నిన్ను నే నాజ్ఞాపించింది?

సన్ని :— నెరవేర్చడానికి వీలుకాలేదు.

పద్మా :—పరిహాసాలాడేవా? నిన్నిక్కడే వురితీయిస్తాను.

సన్ని :—తొందరపడుతూన్నారు. మీ వురిని తప్పించవలసినవాణ్ణి నేను. మీ వురి అయిన తర్వాతనే నా వురి.

పద్మా :—ఆఁ? నీ ప్రాణాలు—

సన్ని :—మీ అధికారానికి బలిచేసుకోవా లనుకున్నారా మహారాణీ?

పద్మా :—సన్నిధాతా! ఆలోచించుకో యిప్పటికైనా జీవకుణ్ణి తుదముట్టించి వచ్చావా? నిన్ను బంగారుతో అభిషేకిస్తాను. ఈసారి వాడి తలే తెచ్చి చూపించాలి:

సన్ని :—మహారాణీ! యింకా ఆద్రోహానికే పూనుకుంటా ననుకున్నావా?

పద్మా :—పద్మావతి కెదురు తిరిగినవాళ్ళకు కడగండ్లు తప్పవుసుమా!

సన్ని :—సన్నిధాత జీవకులవారుకాడు. నీవంటి ఘాతుకురాలి బెదిరింపులకు భయపడిపోయి మహర్షుల

గొంతులు కొయ్యలేను. నీ రాష్ట్ర ప్రభుత్వం యింక సాగించ డానికి వీల్లేదు. ఇంతవరకూ నువ్వు మాకు మహారాణివని నీ అధికారానికి తలలు వంచాం. ఇక ఆ దబాయింపులు మామీద పనిచెయ్యవు. కంఠం తెగిపోయినా సరే యిక జీవకులవారికి ద్రోహం తలపెట్టలేను. అంతేకాదు మహా రాణీ! ఆయనకు ద్రోహం తలపెట్టిన జీవి యెవ్వరైనాసరే క్షమించను. జాగ్రత! నీ ప్రాణాలు నా చేతుల్లో వున్నాయి. ప్రభువుల సమక్షంలో జరిగిన సంగతంతా బట్ట బయలు చెయ్యగలను.

పద్మా :—సన్నిధాతా! నిన్నూ నీ కుటుంబాన్నీ మాడ్చి మసి చేస్తాను.

సన్ని :—యేమన్నావు మహారాణీ? అంతవరకూ నువ్వు ప్రపంచంమీద వుండగలుగుతా వనుకున్నావా? నువ్వు బ్రదికున్నంతవరకూ సన్నిధాత చచ్చిపోడు.

పద్మా :—[భయంకరంగా గర్జిస్తూ] ఆ? ద్రోహీ! [మొలలోవున్న బాకుతీసి సన్నిధాతను పొడవబోతుంది.]

సన్ని :—[తటాల్న పద్మావతీదేవి చేతులు పట్టు కొని] మ-హా-రా-ణీ! నీ ప్రయత్నం వృథా.

పద్మా:—[సన్నిధాత పిడికిలినుండి తప్పించుకోవ డానికి ప్రయత్నిస్తూ] స్వామిద్రోహీ! నువ్వింతవఅకూ వస్తా వనుకోలేదు. నీ ఆటంకంకూడా తొలిగించుకొంటాను.

సన్ని:—మహారాణీ! నాప్రాణాలకే ద్రోహం తల పెట్టిన నిన్ను నాకంటే ముందుగా యమలోకానికి పంపక తప్పదు. ఇదిగో-నువ్వు మంత్రించిపంపిన కత్తికి నువ్వేబలి చావు- [పొడిచేస్తాడు].

పద్మా:—[భీభత్సంగా అరుస్తూ నేలగూలుతుంది.]

సన్ని:—సా-హ-సం- - - - దారుణమైన కార్యం చేసి వేశాను- - - - మగధమహారాణినే హత్యచేసిన సన్ని ధాత యిక ప్రాణాలతో వుండడం అసంభవం. రాజగృహాన్ని హింసాసముద్రంలో ముంచివెయ్యడానికి కంకణంకట్టుకున్న మహామారిని తుదముట్టించడంకోసం నా ప్రాణాల్ని బలిచేశా ననుకుంటాను-చావక తప్పదు-రాజగృహ శాంతికోసం మహా రాణీ-సన్నిధాత-యిద్దరూ-బలి-బలి-బలి-[పొలికేక వేసి, తానూ పొడుచుకొని నేలగూలిపోతాడు.]

[హఠాత్తుగా అజాతశత్రువు ప్రవేశిస్తాడు]

అజాత:—ఎవరు? యేమిటి యీ ప్రళయం? పద్మా వతీ! పద్మావతీ!!

పద్మా:—[గుండెనుండి కారుతున్న రక్తాన్ని చేతితో అదుంకొంటూ] అ-బ్బా- - - - ప్ర-భూ- - - -

అజాత:—పద్మావతీ!

పద్మా:—ప్ర-భూ! తీరిపోయింది పద్మావతి జీవితం. నా కోపానికి సన్నిధాత-సన్నిధాత సాహసానికి నేనూ బ-లి- - -

అజాత:—ఆఁ? పద్మావతీ!

పద్మా:—చక్రవర్తీ! కడసారికోరిక.

అజాత:—ఏమది పద్మావతీ!

పద్మా:—పసేనదితో మీరు యుద్ధం విరమించుకోకూడదు- - -కోసలసైన్యాల నెత్తురుతో నా శవాన్ని అభిషేకించండి- - - శత్రువులరక్తం నేలచిందేవరకూ యీ హృదయంలో వేడితగ్గదు- - -

అజాత:—పద్మావతీ! యిప్పుడుకూడానా యీ క్రోధం? అంతఃపురం యిప్పటికే అర్ధం శ్మశానమైపోయింది.

పద్మా:—అర్ధాంగి కడసారి కోరిక ఆత్మపూర్వకంగా కొనసాగించండి!

అజాత:—పద్మావతీ! యెందుకో ఉత్సాహమే చచ్చిపోతూంది.

పద్మా:—ధైర్యంతో విజృంభించండి-కడసారి వూపిరి విజయానందంతోనే విడుస్తాను-చేతిలో చెయ్యివెయ్యండి!

అజాత:—ప-ద్మా-వ-తీ--[చేతిలో చెయ్యివేస్తాడు]

పద్మా:—చ-క్ర-వ-ర్తీ--[కండ్లు మూస్తుంది]

అజాత:—పద్మావతీ- -పద్మావతీ- - అమాయకురాలు - - - దూరాన మండిపోతూండిన గుడిసెను చూచి నవ్వింపేకాని, తనయిల్లు కాలిపోవడానికి ఆ నిప్పే కారణమని ఆలోచించలేక పోయింది......

[ప్రతిసీర]

౮

[రాజగృహ సమీపం. పసేనది సైన్యాలు విడిచి వున్న చోటు. ఒక డేరా బయట జీవకుడు నిలుచుకొని దూరాన జరుగుతూన్న యుద్ధాన్ని చూచి కలవరపడుతూంటాడు. లోపల్నుండి యుద్ధభేరి భయంకరంగా వినపడుతూంటుంది. ఈ కోలాహలంలో "గురుదేవా! గురుదేవా!" అన్న కేక.]

జీవ:—ఎవరది?

[లోపల

"గురుదేవా! గురుదేవా!"]

రాజకుమారి కంఠస్వరంలావుంది. రాజకుమారీ! రాజకుమారీ! [వెదుక్కొంటూ వెళ్తాడు.]

వజిరా:—[మరోవైపునుండి వచ్చి] గురుదేవా! గురుదేవా! [వెతుక్కొంటూ వెళ్తుంది.]

[లోపల యుద్ధభేరి]

జీవ:—[మరోవైపునుండివచ్చి] రాజకుమారీ! రాజకుమారీ!

వజిరా:—[వెనకనుండి పరుగెత్తుకొంటూవచ్చి] గురుదేవా!

జీవ:—రాజకుమారీ! గుడారం విడిచి యిక్కడికెందుకు వచ్చావు?

వజిరా :—[తత్తరపాటుతో] గురుదేవా! యెంత ప్రయత్నించినా మనసుండడంలేదు. యుద్ధం ప్రారంభమై యెంతసేపైంది?

జీవ :—ఇప్పుడే.

[లోపల యుద్ధభేరి]

వజిరా :—గురుదేవా! ఆ పరుగెత్తేది మామగారి యేనుగేకదా? గాలివానలో పరుగెత్తే కారుమబ్బేమో అనిపిస్తూంది.

జీవ :—రాజకుమారీ! అలాచూడు! ఆ రక్తప్రవాహంలో కొట్టుకుపోతూన్న కళేబరాలు యెట్టుసముద్రంలో యీదులాడే చేపల్లావున్నాయి. ఘోరం---యీ ప్రళయాన్నింక చూడలేను రాజకుమారీ? యుద్ధం పూర్తికా వచ్చినట్లుంది.

[లోపల యుద్ధభేరి]

వజిరా :—అటుచూడండి! మామగార్ని యెంతమంది యోధులు చుట్టు ముట్టేశారో. అబ్బా—ఆ మహావీరుడు అగ్నిపర్వతమై పోతూన్నాడు. గురుదేవా! నాన్నగారి యేనుగేదీ? నాకేమో భయమేస్తోంది.

[లోపల యుద్ధభేరి]

యెవరిదా పైకెత్తిన పతాక?

[మళ్ళీ లోపల యుద్ధభేరి. "బంధించండి! బంధించండి! సహాయం, సహాయం" అన్న కేకలు.]

జీవ :—రాజకుమారీ! కోసల పతాక పైకిలేచింది. అదుగో—యిటేవస్తూన్నారు—యిక పోదంపద.

వజిరా:—గురుదేవా! మా–ను–గా–రు.

జీవ :—అమాయకురాలవు రాజకుమారీ! అగ్గిలో దూకి చల్లదనాన్నాశిస్తున్నావు—పోదంపద!

[లోపల జయభేరి. "సహాయం, సహాయం. బంధించండి! బంధించండి!" అన్న కేకలు. అజాతశత్రువు భీభత్సంగా అరుస్తూ నుదిటిమీది గాయాన్ని చేత్తో అదుముకొంటూవచ్చి, గుడారం దగ్గర కూలిపోతాడు. వెంటనే కోసలసైనికులు పైకిదూకి బంధించి వేస్తారు. ఇంతలో పసేనది అట్టహాసంచేస్తూ ప్రవేశిస్తాడు.]

పసే :—అహ్హాహ్హాహ్హా — మగధ సామ్రాజ్య చ–క్ర–వ–ర్తి. భార్య పంజరంలో పావురమైపోయి, కన్న తండ్రినే చెరలోబెట్టి కాలరాస్తున్న ప్రే–మ–మూ–ర్తి. ఉన్న రాజ్యం చాలక కాశికిగూడా పట్టాభిషిక్తుడు కాదలచుకొన్న శై–శు–నా–గ–వీ–రు–డు. అజాతశత్రూ! చాలునా యీ బిరుదాలు? ఏ బలం చూచుకొని యుద్ధానికి వచ్చావు?

అజాత :—భుజబలం.

పసే:—అహ్హాహ్హాహ్హా—యిప్పు డేమైంది?

అజాత :—సేనల దౌర్బల్యంవల్ల మమ్మోల్లడించింబోక లెక్కకాదు. [ఖడ్గాన్నిచూపుతూ] ఇదిగో—క్షత్రియత్వానికి కడసారి పరీక్ష. ధర్మ మంగీకరిస్తారా? నేను

నిస్సహాయుణ్ణి. మీరూ నిస్సహాయంగా నిలవండి. యేబలం చూచుకొనివచ్చిందీ మీకే తెలుస్తుంది,

పసే :-ధ-ర్మం--- అజాతశత్రూ! మూర్తీభవించిన ధర్మదేవతవుకదూ నువ్వు? నిద్రపోతున్న తండ్రిని పైబడి బాధించినప్పుడు యీ ధర్మం యెక్కడికిపోయింది? రాజ వైద్యుడిమీదికి సన్నిధాతను పంపించినప్పుడు యీ ధర్మం యెక్కడికి పోయింది?

అజాత :— కోసలపతీ!

పసే :—మమల్ని మామా! అనడానికి నీకు సిగ్గవు తూంది కదూ?

అజాత :—మేమిప్పుడు మీ ఖైదీలం. మీ యిష్టం వచ్చినట్లు శిక్షించుకోవచ్చునే కాని, మా సాంసారికాలతో జోక్యం కలిగించుకోవడానికి అధికార మివ్వబడదు. గౌరవం కాపాడుకోవడం మంచిది.

పసే :—లేకుంటే ?

అజాత :—శైశునాగమాత్రజ్యోతి ఆరిపోనిది.

పసే :—అజాతశత్రూ!

అజాత :—అడ్డులేనిది.

పసే :—అజాతశత్రూ!

అజాత :—అసాధ్యమైంది.

పసే :—అజాతశత్రూ!

అజాత:-మీరు మాట్లాడుతూన్నది అధిక ప్రసంగం.

పసే :—అజాతశత్రూ! నువ్వేనా నూట్లాడుతున్నది?

అజాత :—మాగధ సార్వభౌముడు.

పసే :—నువ్వు మా కోసలదేవి కొడుకువని చెప్పుకోవడానికే సిగ్గవుతూంది. అజాతశత్రూ! చక్రవర్తివి. యింత సామ్రాజ్యాన్ని ఆడదాని కనుక నన్నల్లో పరిపాలించ తలచుకున్నావు కదూ? ఎక్కడికిపోయింది నీపౌరుషం? ప్రాణపదంగా ప్రేమించి, నిన్ను యింతవాణ్ణి చేసిన కన్న తండ్రినే చెఱలో పెట్టించి, కూడూ, నీరూ చూపించకుండా మాడ్చి చంపుతూన్నావు. యెక్కడికిపోయింది నీ ధర్మం! నీకోసం యింత సామ్రాజ్యాన్ని నిలబెట్టిన ఆ ప్రేమమూర్తి నీ జీవాలకు ఆ యినుపకమ్ములమధ్య యెలా విలపిస్తూన్నాడో-ఆ ముసలిగుండె యెంత క్షోభపడుతూందో-ఆలోచించుకో. అజాతశత్రూ! బింబిసారుడు నీతండ్రి-నిన్ను తన ఒళ్లో కూచోబెట్టుకొని ముద్దాడినవాడు — శైశునాగవంశానికి మంగళహారతులు తీసినవాడు. యింకనైనా కరగదా నీ మనస్సు? పో—యిప్పటికైనా తండ్రి పాదాలమీదపడి క్షమాపణ వేడుకో!

అజాత :—మేముచేసింది నిజంగా పొరబాటేనా?

పసే :—అమాయకుడివి. జీవకుణ్ని చంపమని నన్ని ధాతను పురికొల్పింది నీ భార్య కాదూ? దైవంతో సమాన

మైన తండ్రిని చెరసాలబెట్టి చంపమని నీకు బోధించింది నీ భార్యకాదూ ?

అజాత :— - - - - - -

[జీవకుడు ప్రవేశిస్తాడు]

జీవ:—మగధసామ్రాట్టుకు ప్రణామం.

అజాత:— జీవకా !

జీవ:— ప్రభూ జరిగిపోయింది మరచిపోండి. కాని,

అజాత:—జీవకా !

జీవ:— పితృదేవులు-యినుపకమ్ములమధ్య మృత్యుదేవత ప్రసన్నంకోసం తపస్సుచేస్తున్నారు. యీక్షణాన్నో-మరుక్షణాన్నో ఆమె వారికోరికను చెల్లిస్తుంది.

అజాత:— జీవకా ! మా ప్రేలితో మా కన్నే పొడిచారు. యీ పాపవిముక్తికి మార్గం?

జీవ:— తండ్రిగారి పాదరజం.

అజాత:— అవును. ప్రశాంతమైన పాలసముద్రం గుండెమీద చిచ్చరపిడుగుల్ని కుమ్మరించాను-అమాయికమైన మునలికోయిలను అగ్నికుండంలోవేసి బూడిదచేశాను-పాల పొంగుమీద విషకుంభాన్ని దొర్లించాను - - - పద్మావతి గుండెల్లో యింతపెద్ద అగ్నిపర్వతం దాగివుందని తెలుసుకో లేక పోయాను- - - - నాన్నా ! నాన్నా! నాన్నా!!

[వెళ్తాడు]

[ప్రతిసీర]

[చెఱసాల. కమ్ములతలుపులకు బైట—లోపల వుండే వారిచేతులకందని దూరంలో ఒక మంచినీటి కూజా, పళ్ళెరంలో అన్నపుముద్ద పెట్టబడి వుంటాయి. బింబిసారుడు పిచ్చిపిచ్చిగా మాట్లాడుకుంటూ కమ్ములమధ్య చెయ్యిదూర్చి నీటికూజా నందుకోవడానికి పెనగులాడుతూంటాడు.]

బింబి :— దాహం- దాహం- అబ్బ- నాలుక నిప్పుకణికై పోతూంది. కుణికా! కుణికా! యీ శిక్ష నాకు యెన్నిదినాలు విధించావు నాయనా! అందనిదూరంలో అన్నంపెట్టి అంతఃపుర సౌధంమీద జేరి వెక్కిరిస్తున్నావా? నీకు నేనేం ద్రోహంచేశాను! అబ్బ- దాహం- దాహం- [కమ్ములకు కొట్టుకొని తల గాయమౌతుంది. నుదుటినుండి కారుతూన్నరక్తాన్ని చేతులకద్దుకొని, దిగ్భ్రమతో కన్నీరు కారుస్తూ] రక్తం-రక్తం-కుణికా! యిదేనా యిందులోని అర్థం? కన్నుల్లో అన్నమూరగిస్తూ, మొదణ్ణే నంజుకొమ్మని నీ తండ్రికి నీతి ఉపదేశిస్తున్నావా? దౌర్భాగ్యుణ్ణి- దాహం తీరే అంత నెత్తురైనా తలనుండి కారకపోయింది. అ-బ్బా- [వ్రేళ్ళ కొనలకు తగిలి కూజా దొల్లిపోతుంది. వెంటనే క్రిందికి వంగి, తనవైపుకు పారుతూన్న నీళ్ళను ఆత్రంతో జుర్రుకుంటూ] దాహంతీర లేదు-తీరలేదు నాదాహం-ఆకలి-ఆకలి-కుణికా! పట్టెడన్నానికైనా అనుజ్ఞ యీ నాయనా! యివ్వవూ? యివ్వవూ? అవును. కన్నతండ్రి ఆకలిమంట చల్లార్చే అంత చల్లదనం నీ హృదయంలో లేదు కాబోలు.

[వెర్రిచూపుల్తో గదినంతా పరికిస్తూ, మూల పరిచివున్న గడ్డినిచూచి] కుణికా ! కడకు నీ తండ్రి కేమి మిగిల్చావు నాయనా ! కారాగృహంలో నివాసం–గడ్డిపరకలమీద పవ్వళింపు–అంతేనా ? అబ్బ – కుణికా ! యీ ఆకలిబాధను భరించలేను. [చేతులనిండుకూ గడ్డిపీక్కొని] ఇదిగో– యీ గడ్డిపరకలే నా ఆహారమేమో. జంతుజాలాల కన్నిటికీ నీ రాజ్యంలో ఒకేఆహారం అభ్యాసం చెయ్యిస్తున్నావా నాయనా ? సంతోషం–ఇదిగో– ఇదిగో– మగధ సార్వభౌమ సింహం గడ్డిమేయడానికి యిదే మొదలు – తుది. తినేస్తున్నాను. యిదికూడా నీ కరుణాఫలితమే–ఇదే బింబిసారుడి ఆహారం – యిదే – యిదే – [ఆత్రంతో గడ్డిని పర పరా నమిలి మ్రింగుతాడు]

[లోపల్నుండి

నాన్నా ! నాన్నా ! నాన్నా !]

ఎవరు ? కుణికుడు– అదిగో – వస్తున్నాడు పితృఘాతి– చంపడానికేమో–కుణికా! నేను నీచేతిలో చావను-చావను– చావను– – –ఆశక్తి నాకేవుంది–యిదిగో –[కత్తుక నులుము కొనినెత్తురుకక్కుతూ] కుణికా! యిప్పుడు తీరిందా నీ కోరిక? యిక శాంతంగా వుండు. వెళ్తున్నాను – వెళ్తున్నాను– భగవాన్ ! భగవాన్ ! ప్రణామం– – – ప్ర–ణా– – –

[నేల గూలిపోయి ప్రాణాలు వదుల్తాడు. అజాత శత్రువు "నాన్నా ! నాన్నా !" అని అరుచుకుంటూ పరుగెత్తుకొని వస్తాడు. అప్పటికే తండ్రి ప్రాణాలు విడిచి,

పడివుండడంచూచి, దిగ్భ్రమతో కన్నీరు విడుస్తూ అలాగే నిలబడి పోతాడు.

[లోపల్నుండి]

జీవ :— భయదహింసా ఢమరుకారవంబు లెసగ
దూకె తమసపిశాచంబు తూర్పునుండి
స్నేహజాలని యెదతోడ చక్రవాక
మనువులనుబాసె శోణ సాంధ్యాగ్నిలోన.

[బుద్ధభగవానుడు ప్రవేశిస్తాడు]

అజాత :— ప్రణామం భగవానులకు.

బుద్ధ :— శుభంభూయాత్ !

అజాత :— భగవాన్ ! క్షమించండి ! కన్నతండ్రిని చెరబెట్టి చంపిన యీ పశుప్రాయుణ్ణి క్షమించండి!

బుద్ధ :— అజాతశత్రూ! పాపపరిహారానికి పశ్చాత్తాపం కొంతవరకు సాధనేకాని, అజ్ఞానంలాగే అమాయకత్వం కూడా అపాయకరంసుమా! తండ్రిగారి మరణానికి చింతించవద్దు. జననమరణావస్థ సృష్టిలోని విడదీయరాని గుణం. ఒకానొకనాటికి యీ సృష్టికి కూడా మరణం తప్పదు. కట్టకడపట సూర్యచంద్రములు సైతం వాయువులో కలిసిపోవలసినవారే. మరణం శాంతిరాక్షసి— జననం సంపెంగ పూవు. కష్టసుఖాలు ఉషస్సంధ్యలు. చింతించవద్దు.

అజాత :— భగవాన్ ! ప్రపంచమంతా చీకటి గుహలా కనిపిస్తూంది. యీ పాపభరమైన హృదయాన్ని యిక మొయ్యలేను.

బుద్ధ :— అజాతశత్రూ! గడిచిపోయిన జీవితాన్ని నీకు నీతిబోధించే గ్రంథంగా చేసుకో. ఉత్సాహంతో పురో గమనం సాగిస్తూ, స్వార్థాన్ని హింసనూ తోసుచేసుకొనక, జీవితాన్ని నందనోద్యానంగా మార్చుకో.

అజాత :— అజ్ఞానివి, దుమ్ముగప్పిన యీ కండ్లకు దారే కనిపించడంలేదు.

బుద్ధ :—యీ చేతితో చేసుకొని, ఆచేతితో అనుభ విస్తున్న మానవుల అజ్ఞానం క్షమార్హంకాదు.

అజాత :—భగవాన్! రాచరికపు గర్వంతో నిండిన మా హృదయంలో ఆయువు చాలని క్రోధాని కొకదానికే తావు దొరికిందికాని, అనశ్వర ప్రేమకు తావులేక పోయింది. భగవాన్! మాకిక యీ సామ్రాజ్యమే అక్కర్లేదు. అర ణ్యాలలో పడిపోతాం.

బుద్ధ :— అజాతశత్రూ! లోకంకొంతకు ప్రకా శిస్తున్న చంద్రుడు పద్మినికి ప్రాణఘాతి అయినాడు రాజ్యాన్ని న్యాయపావనం చెయ్యగలిగినవాడు రాజే. అంతఃపురానికి వెళ్ళి సుఖించు.

అజాత :—యీ కన్నీటివేడి తగ్గుతుందాభగవాన్?

బుద్ధ :—వేడి కన్నీటికి హింస—చల్లని కన్నీటికి ప్రేమ జన్మస్థానాలు. కష్టసుఖాలకు కారణమైన మేధస్సు మానవుడికే యివ్వబడివుంది. దానిని మెదడుగానే ఉపయో గించుకో. వెళ్ళు. శుభంభూయాత్.

[ఆశీర్వదించి వెళ్తాడు]

[జీవకుడు ప్రవేశిస్తాడు]

అజాత:— జీ-వ-కా! ఆత్మ హత్య.

జీవ :— అస్తమించినాడు సూర్యభగవానుడు. గుండెలో నిండిపోయిన దుఃఖం రక్తమై పొంగిపోయింది. ఆత్మహత్యలో శాంతిస్వర్గం - సెలవుప్రభూ!

అజాత:— జీవకా! యెక్కడికి?

జీవ :—విశ్వవాహిని సుడిగుండాలలోనికి.

అజాత :— మేముచేసిన అపకారం?

జీవత :— సృష్టి ప్రకృతికిచేస్తున్న అవమానం. అనర్ఘమైనమణిని కాలసర్పం నెత్తికెక్కించింది. కోకిలలకు గానసభలైపోయిన మామిడితోటల్లో గుడ్లగూబల గుడారాలను నిర్మించింది. నన్నుగురించి తమరు చింతించకండి. రాజగృహా నికి జీవకుడిసేవ చెల్లిపోయింది.

అజాతా:—జీవకా! మమ్మల్నివిడిచి వెళ్తున్నారా?

జీవ :—ప్రపంచం విపుల. కాలం నిరవధి. పువ్వుల్లో నేనొక పువ్వును. ఆకుల్లో నేనొక ఆకును. మగధ కోసలాల మధ్య శాంతిసరస్సు నిర్మించబడింది. ప్రభూ! ఆనందలక్ష్మి జలకేళి అందులోనే. అనుభవించండి!

అజాత :— మా హృదయాన్ని శూన్యంచేసి వెళ్తున్నారా?

జీవ:—లేతహృదయం శాంతిపీఠం. [పోతూంటాడు]

అజాత :—జీవకా !

జీవ :— కరుణాతరంగితమైన సంఘం స్వచ్ఛమైన మందాకిని లాంటిది.

అజాత:—జీవకా !

జీవ:—ధర్మమే స్వర్గం. [వెళ్తాడు]

[వజిరాకుమారి ప్రవేశిస్తుంది]

వజిరా:—ప్ర-భూ !

అజాత :— వ-జి-రా ! యీ ధన్యజీవి తనువు చాలించాడు.

వజిరా:—వారి పవిత్రాత్మకు శాంతి మగధకోసలాల కోరిక.

అజాత:— వజిరా ! తుదకు రాజగృహం రుద్ర భూమిగా మారిపోయింది.............భగవాన్! అజాత శత్రువు మేధస్సు జీవితాంతంవరకూ యేడుస్తూండవలసిందేనా ? [కన్నీరువిడుస్తూ, బింబిసారుణ్ణి చేతులమీాది కెత్తుకొని లోపలికి వెళ్తూంటాడు. వజిరా అజాతశత్రువు వెనుక నడుస్తూంటుంది. లోపల్నుండి భావగీతి వినిపిస్తూంటుంది.]

అమృతమానసా!
అమృతమానసా! యీ యెడారిలో
మధుర మధురముగ నిరపాయముగా
నీ బ్రదుకు నడత సాగిపోవురా

అమృతమానసా!

పెనుతుపానులో విలయ రవముతో
జగతి గుండియల చీల్చి విదిల్చిన
కారుమేఘములు కదలిపోయెరా
తూరుపుమైలలు తొలిగిపోయెరా

అమృతమానసా!

నిన్నొక్క గడిలో నిలువున గూలిచి
పాతిపెట్టగా పయిపై దుమికిన
హింసా రాక్షసి యిసుక పొరలలో
తూలిపోయి తుదినిదుర జెందెరా

అమృతమానసా!

శాంతి అహింసల సత్య జ్యోతిని
కౌగిలించి కరుణామయమతివై
బుద్ధుని శరణమునందుమురా!
ధర్మము శరణమునందుమురా!
సంఘము శరణమునందుమురా!

[ప్రతిసీర]

[మంగళమ్.]

B. N. K. Press Madras. Q. H. No. M. S. 100/B.
For N. L. R. No. 35/D. 10-9-'46.

